# నిగూఢరహస్యము

( పరిశోధక నవల )

గ్రంథకర్త:

కల్లూరి సూర్యనారాయణశర్మ.



పబ్లిషర్:

నూలు సుబ్బారావు

శ్రీపాండురంగా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

రాజమండ్రి.

1937.

 [వెల రు 1—0—0

# శ్రీ పాండురంగా బుక్ డిపో,

# మెయిన్‌రోడ్, రాజమండ్రి.

ప్రొప్రయిటరు:- నూలు సుబ్బారావు.



మేము ప్రతినెల మూడు పుస్తకముల చొ॥ నవలలు, నాటకములు, వైద్యజ్యోతిష గ్రంధములు, స్త్రీలపాటలు, మున్నగునవన్నియు ప్రచురించుచు, వర్తకులకు టోకున నతిచౌకగా సప్లయి చేయుచున్నాము. వర్తకులెల్లరు, నీ యమూల్యతరుణమును పోగొట్టుకొనకుందురుగాక.

☛ వివరములు తెలిసికొనదలచువారు యీపై అడ్రసుకు వ్రాసి తెలిసికొనుడు.

---

# శ్రీ పాండురంగా ముద్రాక్షరశాల,

# రాజమండ్రి.



మావద్ద అన్నిరకముల అచ్చుపనులు, శుభలేఖలు, లెటరుహెడ్సు, మరియు తదితరమైన కలరుప్రింటింగుపనులు అన్నియు సకాలములో పూర్తిచేసి యివ్వబడును. మరియు రూలింగు, బైండింగుపనులు మొదలగు అన్నిరకములపనులు చేయబడును. ఒకసారి ఆర్డరుయిచ్చిన మీకే తెలియగలదు.

శ్రీ మహేశ్వర దేవతాయైనమః

# నిగూఢరహస్యము.

## మొదటి ప్రకరణము.



సుప్రభాతము- సూర్యభగవానుడు తన సహస్రకిరణ జాలంబులచే జగత్తునాక్రమించిన తమోదేవతను పారద్రోలగడంగుచుండెను. కిలకిలారావంబుల పతంగములు తమ సంతానములకడ సెలవందియాహారాన్వేషణమునకై బయలుదేరుచున్నవి. ఎక్కడో శ్రోత్రియులు కొందరు నిత్యానుష్ఠానమున కాలవ్యయమగుచున్నదని తొందరగ లేచినను, సామాన్య జనులప్పుడప్పుడే నిద్రాదేవి కౌగిళ్ళనుండి వెలువడి దంతధావనాది కాలకృత్యముల నెరవేర్చుకొనుటకీవలకు వచ్చుచుండిరి అయ్యది వసంతకాల మగుటచే శాఖోటమను రవికిరణంబులు చెట్లచిగురుటాకులపైఁబడి వింతవింత రంగులతో ప్రకాశింపసాగెను- వనమునందే గాక పురమునందుకూడ కోయిలచేరి శృంగారముగ కూయదొడంగెను. పురవీధులందప్పుడే చింతచిగురు మున్నగు యాకుకూరలును, పలుతెరంగుల కాయకూరలును యమ్మకముకై నెత్తిగంపలతోను, కావిళ్ళతోను, గొనివచ్చుచుండిరి. వారి కేకలువిని వీధులందున డాబాలపైనను నిదురించుచున్న యువకులు లేచి మెల్లన ధూమపానమునకు గడంగుచుండిరి.

అట్టి సమయమున నొక యువకుడు పాశ్చాత్య వేషధారియై తన ద్విచక్రశకటముపై [Cycle] కాకినాడటవును రైలువేస్టేషనునకు

వడివడిగా బోవుచుండెను. అప్పటికి కలకత్తాపోవు తపాలబండి [Mail] బయలుదేరుట కెంతయో వ్యవధిలేదు. ఆయువకుడు స్టేషనును సమీపించుసరికే బండి స్టేషను చేరుకొనెను. తనసైకిలు నటవారవైచి ఎవరైన నెత్తుకపోదురేమో యనియైన శంకింపక వడివడిగ విశాఖపట్టణమునకు టిక్కెట్టు తీసికొని బండిని సమీపించెను. అప్పటికాబండి బయలుదేరినది. వడివడిగ నెట్టులో బండిలోనికెక్కెను

లోనకరిగినపిదప నాయువకు డొక్క నిట్టూర్పు బుచ్చెను. అప్పటి కాతని హృదయము కొంత శాంతినందెను. అయినను హృదయ పరివేదన పూర్తిగ దీరినట్లు గాన్పించుటలేదు. అతనిముఖమున వ్యాకులత ప్రతిఫలించుచుండెను. ఆయువకుడొకచో కూర్చుండి కిటికీగుండా బయటకు చూచుచు నేదియో దీర్ఘాలోచనము గావించుచుండెను. ధూమశకట మతివేగమున బోవుచుండెను. ప్రపంచమంతయు తనయందుగల వృక్షజాలముతోగూడ వెనుకకు బరువులిడసాగెను.

అట్లు దీర్ఘాలోచనానిమగ్నుడైయున్న యాయువకున కేదియో యాకస్మికముగ స్ఫురణకు వచ్చెను. తోడనే యాతడు తన కోటు జేబులోనుండి యొక కవరు పైకితీసెను. అందుండి యొక కాగితమును తీసి దీక్షతో చదివెను. మరల చదివెను. ఆకాగితమును చదువుచున్నప్పు డాతని నేత్రములవెంట నశ్రుకణంబులు రాలదొడంగెను. మరల కాగితమును మడచి కవరులోనుంచి జేబులో వైచుకొనెను. ఏదియో నిర్ధారణకు వచ్చినట్లుగ నాతడు తల పంకించెను.

ఇంతలో ధూమశకటము సామర్లకోట చేరెను. ప్రయాణీకు లందరును తమతమ సామగ్రులతో బండిదిగుచుండిరి. స్టేషనున పండ్లు వగైరాల నమ్మువారి కేకలు చెవుల ప్రతిధ్వనించుచుండెను. మన యువకుడుకూడ బండిదిగి యావలివైపునకు వచ్చెను. కలకత్తామెయిలు నకు గంటకొట్టిరి. అందరును బండికొఱకు నిరీక్షించుచుండిరి.

ఆయువకుఁడుగూడ నటగల యొకబల్లపై కూర్చుండెను. అంతలో నొక మహమ్మదీయుఁడు తన చేతికఱ్ఱను విలాసముగఁ ద్రిప్పుకొనుచు ప్లాట్‌ఫారముమీద పచారుచేయుచు నాకస్మికముగ బల్లపై కూర్చుండిన యువకునిగాంచి తెల్లబోయెను. వాని ముఖలక్షణములు మారి పోయెను. ఆయువకుఁడు మాత్రమా మహమ్మదీయుని నివ్వెరపాటును గాంచలేకపోయెను.

మహమ్మదీయుఁడు తన మనోచాంచల్యమును మరుగుపఱచుకొని యెప్పటియట్ల పచారు చేయసాఁగెను. గాని యాతఁడొక కంట నా యువకునిఁ గనిపెట్టుచునే యుండెను. మహమ్మదీయుఁడాతనితో మాటలాడ వలయునని గాబోలు రెండుమూఁడుమారులాతని సమీపింప బోయెను గాని మరల నేకారణముచేతనో తన ప్రయత్నమును మార్చుకొనెను.

ఇంతలో ధూమశకటమువచ్చి స్టేషనులో నాగెను. బండినెక్కువారు త్రొక్కిసలాడి యొకరినొకరు త్రోసికొనుచుండిరి. యువకుఁడా జన సమ్మర్దము తగ్గినపిదప తానెక్కవచ్చునని యూహించిగాబోలు యా బల్లమీదనే కూరుచుండెను. మహమ్మదీయుడు కూడ వాని కనతి దూరమున నిలువబడి యుండెను.

బండి కదలుటకు గంటకొట్టిన తోడనే మనయువకుడు లేచి రైలుబండిని సమీపించి ఇంటరుక్లాసు పెట్టెలో నెక్కెను. మహమ్మదీయుఁడు మాత్ర మాపెట్టెలో నెక్కక దాని ప్రక్కనే యున్న మూడవతరగతి పెట్టెలో నెక్కెను. బండికదిలి మహావేగమున బోవు చుండెను. బండి కదలినప్పటినుండియు మనయువకుని మనోవేదన క్రమక్రమముగ దగ్గుచుండెను. గాని మహమ్మదీయుని కాలోచనములు హెచ్చుచుండెను.

మొయిలు పల్లెలు, పట్టణములు, గుట్టలు, మెట్టలు గడచి పోవుచుండెను. ఎలమంచిలి చేరెను. అచ్చట నొకయువతి ప్లాట్‌ఫారమంతయు తిరిగెను. ఆమె కింటునుతాగతి పెట్టె లెవ్వియు కాలీగా గాన్పింపక పోవుటచే నామె మన యువకుఁడెక్కిన పెట్టెయందే యెక్కవలసి వచ్చెను. తన సామానులన్నియు లోన బెట్టించి యామె బండి నెక్కెను. కూలివాఁడు కూలినడిగెను. ఆమె తన మొలలోని పర్సుతీసి చూచెను. గాని చిల్లర లేకపోయెను. రూపాయి మార్చుట కామె యెంతయో యత్నించెను. కాని చిల్లర దొరకలేదు. బండి కదలుటకు గంటకొట్టిరి. కూలివాఁడు తనకూలి నీయకున్న సామానుల దింపి వేయుదునని యాయువతిని బెదరింపసాఁగెను. ఆమె యూరాట పడుచుండెను. కూలివాని బాధ యెక్కువగ నుండెను.

బండి కదలుటకు సిద్ధముగ నుండెను. ఆ యువతి కూలివానివలన బొందుచున్న యిబ్బందిఁజూచి జాలినొంది మన యువకుఁడు తన పర్సులోని రెండణాలుతీసి యూతనికిచ్చి పంపివేసెను. ఆ యువతి యువకుని జూచి తన కృతజ్ఞతను దెల్పుచు నిట్లనెను. "అయ్యా! మీ యుపకారమునకు కృతజ్ఞురాలను. రాబోవు స్టేషనున మార్చి మీపైకము మీ కొసంగెదను."

యువకుఁడు చిరునగవుతో యంగీకార సూచకముగ తల నూపెను. ఆయువతి రెండవ ప్రక్కనున్న బల్లపై నాసీనయయ్యెను.

ఆయువకుఁడు తన యాలోచనలోనే తా నుండెను. ఆ యువతి మాత్ర మేయాలోచనయు లేక నాయువకుని నఖశిఖ పర్యంతరమును పరికించుచునే యుండెను. ఆమె చూపులందొక యమోఘమయిన తేజస్సు ప్రకాశించుచుండెను. పాఠకులారా! సర్వాంగ సుందరియు, సంపూర్ణ నవనవోన్మేష యౌవనయు నగు నాతరుణి నేత్రముల ప్రకాశించుచున్నదివ్యజ్యోతి యేమియో పరికించితిరా? ప్రేమ— నిర్మల పవిత్రప్రేమ-హిందూసుందరుల కమూల్యధనమగు పవిత్రప్రేమ

ఆ యువకుఁడామెవైపైన చూడలేదు. ఆతనికి యాతరుణి దృక్కులమూలమున వెల్లడించుచున్న నిశ్చలప్రేమ యెట్లు తెలియును? పాపము ముగ్ధయగు నాతరుణి మాత్ర మెట్లు తన కాతని యెడఁగల యనురాగమును వెలిబుచ్చఁగలదు?

ఇట్లు సుమారరగంట గడచెను. అప్పటి కాయువతియే యాతని పల్కరింప సాహసించెను. మెల్లన నామె "అయ్యా! తమ రెంత వరకు వెళ్ళెదరు?" అనెను.

"విశాఖపట్టణము.

"అచట నెవరైన బంధువు లుండిరా?"

"లేరు. ఒక స్నేహితుని కస్వస్థతగా నుండుటచే చూచుటకు వెళ్ళుచుంటిని."

అప్పటికినిగూడ యా యువకుఁడామెవైపు దృష్టి మరల్పలేదు.

"ఆమిత్రుని పేరు?"

యువకుఁడాశ్చర్యమందెను. చటాలున నామెవైపుదిరిగి, "అదే మట్లడుగుచుంటివి? మీది విశాఖపట్టణమా?"

"అవును. ప్రస్తుత మచ్చటనే యున్నాను."

"ఏమి చేయుచున్నావు?"

"మొన్ననే బి. ఏ. పరీక్ష అయినది."

యువకుఁ డాశ్చర్యమందెను. "అయిన శ్రీనివాసరావు నెఱింగియే యుందువు."

"ఆహా బాగుగ నెఱుఁగుదును."

"ఆతనికే జబ్బుగా నున్నది. సన్నిపాతజ్వరమట. ఉదయము ననే టెలిగ్రాము వచ్చినది."

అయ్యో! పాపము. ఎట్లుండునో! చాల మంచివాఁడు.

ఆమె కన్నుల వెంట నీరు కారకున్నను, ముఖమున విచారము తాండవించిపోయెను. ఆమె నిజముగ శ్రీనివాసరావుకొఱకు వ్యాకుల మందెననుట యథార్థము. అయ్యది యాయువకుండు స్పష్టముగ నామె ముఖమున గ్రహింపఁగలైను.

"ఆతని యస్వస్థతకు నీవు వ్యాకుల మందుచుంటివి. నీకేమైన చుట్టమా?"

"కాదు కాదు. గత రెండుసంవత్సరములనుండియు మేమిరువుర మొక్కక్లాసే చదివితిమి. ఆతఁడుదారగుణసంపన్నుఁడు. మేధావి ఆతని సద్గుణములు ప్రతి మానవవ్యక్తిని యాకర్షించుననుట యతిశయోక్తి గానేరదు. మాదుమిక్కిలి మాయిల్లుకూడ నాతని యింటి ప్రక్కనే. ఆతనిభార్యకూడ సద్గుణ సంపన్న."

"అటులయిన నీవు వారికుటుంబమంతయు నెరుంగుదువన్నమాట"

"ఆ! బాగుగ నెరుంగుదును. మీ కాతనితో స్నేహమెక్కడ?"

"ఆతని స్వగ్రామము కాకినాడ. ఆతనిని విశాఖపట్టణములోని విశ్వనాథశాస్త్రిగారు పెంచుకున్నారు"

"అయ్యా! మీపేరేమి?"

"మోహనరావందురు."

మరల బండి స్టేషనులో నాగెను. మాటల సందడిలోనున్న నా యువతీ యువకు లిరువురునుగూడ నాస్టేషనేదియో గుర్తింపలేదు. వారట్లు మాటలాడుచుండగనే యామహమ్మదీయుఁడు రెండుమూడు పర్యాయము లేతెంచి యామాటలాడుచున్న యువతీ యువకులఁ దిలకించెను. ఆతని యాశ్చర్య మగ్గలమయ్యెను. ఆయువతి యెవ్వరు! ఆమె మోహనరావుతో నంత చనువుగ మాటలాడుటకు కారణమేమి? ఆమె యేస్టేషనులో బండినెక్కెను? మున్నగు యాలోచన లాతని హృదయమును బాధింప గడంగినవి. రైలుబండి కూసినది. తోడనే యా మహమ్మదీయుఁడు వడివడిగ తనపెట్టెలో నెక్కెను. బండికదలెను.

మోహనరావా యువతితో మాటలాడుట యింకను మాన లేదు.

" తరుణీ! నీవిప్పు డెచ్చటనుండి వచ్చుచుంటివి? "

" మోహనరావుగారూ! నా స్వగ్రామము విశాఖపట్టణమే! ఎలమంచిలిలో నా మేనమామ నివసించుచుండెను. సెలవుదినము లగుట నచటకు బోయియుంటిని. అక్కడనుండియే యీ రాక. "

" నీపేరు? "

" సరోజని "

ఆకస్మికముగ నాతని కేదియో స్మరణకు వచ్చెను. తన జేబు లోని గెజిటు పైకితీసెను. అందు బి. ఏ. పరీక్షయందు దుత్తీర్ణులైన వారిపేర్లు వ్రాయబడి యున్నవి మొదటనే "మిస్. సరోజని వైజాగ్" అని యున్నది. అద్దాని నాయువతికిచూపి " యీపేరు నీదేనా? " అని ప్రశ్నించెను.

సరోజని యాపత్రిక నందుకొని చూచి " అగును నాదే. దానిక్రిందనే శ్రీనివాసరావు పేరుకూడ నున్నది. " అని పల్కి యందలి కాగితముల తిరుగవేయ సాగెను. ఆకస్మికముగ నామె నివ్వెర పడెను. అందొకచోట " యస్. మోహనరావు. సి. ఐ. డి. " అని యున్నది. ఆమె చూపులువెంటనే మోహనరావు మోముపై వ్రాలెను మోహనరావు సామాన్యదుస్తులను మాత్రమే ధరించియుండెను ఆతడామె మనోగతాభిప్రాయము నవలీల గ్రహింపగల్గెను. " సరోజనీ! ఏమట్లు తెల్లబోయెదవు! నీయభిప్రాయము నిజమే. " అనెను.

సరోజని నిలువబడి వినయంబున నాతనికి నమస్కరించెను.

" ఎరుగక మీతో నింత చనువుగ కూర్చుండి యింతవరకు సంభాషించినందులకు మన్నింతురుగాక! "

ఆమె యీపలుకుల నుడువునప్పు డామెలోనుండి యొక దివ్యజ్యోతి ప్రకాశమానముగ వెల్వడి మోహనరావు హృదయమున బ్రవేశించి కలంచివైచెను. ఆతఁడు కడు బ్రయాసపై నాతని హృదయమును పదిలపఱచుకొని, “ సరోజనీ! తప్పులేదు. విద్యావతివి. యీ స్వల్పవిషయమున నిట్లు బేలవగుట తగదు కూర్చుండుము. అదియుంగాక నిది గౌరవింపవలసిన స్థలముకాదు. ” అనెను.

ఆపలుకులామె హృదయమును మరింత కలచివైచెను.

బండి నిలచినది పోర్టర్లు ‘ వాల్తేరు ’ అని కేకలు వేయసాగిరి. అంతవర కాలోచనామగ్నయై శిలావిగ్రహమువలె నిలచిపోయిన సరోజని యాకేకలువిని తెలివిగాంచెను. ఒకపోర్టరునుపిలచి సామానులు దింపుమని పలికెను. సామానులన్నియు దింపినపిదప సరోజనీ మోహనరావు లిరువురు బండిదిగిరి.

అప్పుడే వేరొక పెట్టెలోనుండి దిగిన పోలీసు సబినస్పెక్టరు రంగారావు మోహనరావును గుర్తించి యాతని సమీపించి వినయపూర్వకముగ సలాముచేసెను.

“ రంగారావుగారూ! విశేషము లేమయిన గలవా? ”

“ ఏమియు లేవండి. ”

“ ఇప్పు డెచ్చటకు వెళ్ళుచుంటిరి? ”

“ సూపరింటెండెంటు దొరగారు రాజమండ్రినుండి వచ్చుచున్నారు. నేనుకూడ వారితో వచ్చితిని. ”

“ సరే, నేనిప్పుడు తొందరగా విశాఖపట్టణము వెళ్లుచున్నాను రేపువచ్చి దొరగారిని కలసికొందును. ”

“ ట్రెయిను ఆలస్యమగును. కారుపై వెళ్ళకూడదా! ”

మోహనరావు సరోజనివైపు చూచెను. ఆమె తన యంగీకారమును దెలుపుచు తల నూపెను.

" సరే. యీసామానులు కారులో పెట్టించండి. మేము కొంచెము కాఫీ తీసుకుని వచ్చెదము. "

మోహనరావు సరోజినితో రైల్వే హోటలులో ప్రవేశించెను. ఇరువురును ఫలహారము గావించిరి. ఇంతలో కారు సిద్ధమయ్యెను. సరోజనీ మోహనరావు లిరువురును కారులో వైజాగ్‌కు ప్రయాణమైరి. —

---

# రెండవ ప్రకరణము.



" అబ్బా! నేనింక జీవింపను. ఈబాధ భరించుట కష్టము. మోహనరావూ! ఇంత నిర్దాక్షిణ్యమా! మిత్రునిమాట మరచితివా? "

" నాథా! ఉదయముననే కాదా టెలిగ్రా మిచ్చినది! వ్యవధి యేది? తంతి యందుసరికి మెయిలు దొరికిన నీసరికి వచ్చుచునే యుండును. "

" కమలా! వట్టిది. అతఁడురాఁడు. అయ్యో! నాహృదయవేదన వ్యాధిని మరింత బలపఱచు చున్నది. "

" కొంచెము విశ్రాంతి తీసికొనుఁడు. విపులముగ మాటలాడ రాదని వైద్యుఁడు చెప్పియుండలేదా? "

" వైద్యుఁడా! నాకేమందును అవసరములేదు. మోహనరావు వచ్చినచో నావ్యాధి తనంతతానే తగ్గిపోవును. ఆహా! ప్రపంచమున మిత్రునివంటి పదార్థము లేదుగదా! విపత్సముద్రమున మునింగిన మానవుల దాటించుటకు తెప్ప- అట్టిమిత్రుఁడు- మోహనరావుండిన నింత యవస్థ తటస్థింపక పోయి యుండునే. " అని దుఃఖింప సాఁగెను.

అవ్యక్తి యొక్క మంచముపై పరుండియుండెను. అతడే శ్రీనివాస రావనియు, ఆ ప్రక్కనున్నయామె యాతని భార్యయగు కమలయనియు మేము వ్రాయనక్కఱలేదే మా పాఠకులు గ్రహింప గలుగుదురు. శ్రీనివాస మోహనరావులు బాల్యమిత్రులు. శ్రీనివాస రావు కాకినాడనుండి విశాఖపట్టణము దత్తుడుగా వచ్చెనని వెనుకనే చెప్పంబడెను. కొన్నికొన్ని కారణములచే నాతని విద్యాప్రవాహము నకు మధ్య నైదారేండ్లంత రాయము వచ్చుటచే నాతఁడా సంవత్సరమే బి. ఏ. తరగతి పూర్తిగావింపఁగలైను ఆతని వయసు సుమా రిరువది మూడు వత్సరములుండును. మోహనరావుకన్న రెండు సంవత్సరములు చిన్నవాఁడయినను మోహనరావుతో సమానమయిన మేధావియని చెప్పక తప్పదు.

శ్రీనివాసరావు భార్య కమలకూడ చక్కనిదే ఆమెకు పెద్దల యెడఁగల వినయ విధేయత, పతిభక్తి, సంసారమును దిద్దుకొనుటలోఁ గల నేర్పు వర్ణనాతీతము. ఆమె వయసున పదునారేండ్లదయ్యును యనుభవమున వయసుమీరిన వారిని మించియుండును.

శ్రీనివాసరావున కించుక నిద్రపట్టెను. అందుచే కమల యింటి పనుల చక్కబెట్టుటకై లోనికరిగెను కాని అంతలోనే వీధితలుపువద్ద నెవ్వరో పిలచినట్లగుటచే నామెవచ్చి తలుపు తెఱచెను.

ఎదుట మోహనరావు నిలువఁబడి యుండెను. నిశ్శబ్దమైయున్న యాగృహమును చూచినంత నాతని హృదయ మావేదనకు లోనయ్యెను ఆతనిం గాంచుటతోడనే కమల కన్నుల నీరునింప ప్రారంభించెను. మోహనరావామె నోదార్చెను. " చెల్లీ! దుఃఖింపకుము. శ్రీనివాస రావున కేమియు భయములేదు. భగవంతునిదయ మనయెడ పూర్తిగా నున్నది. " అనెను.

"అన్నా! ఏమో! నాయదృష్ట మెట్లున్నదో! నేటి యుదయమునుండియు వారు పడినబాధ- అబ్బా! తలంచుకొన్న నాగుండె బ్రద్దలగుచున్నది నీకో ఆకు వారు పొందిన పరివేదనము వర్ణింప నలవి కాదు. ఇప్పుడే కొంచెము నిద్ర పట్టినది."

"కమలా! భయములేదు. నీవు బిగ్గరగ మాటలాడినచో, నాతనికి నిద్రాభంగము కలుగును. లోనికరిగి నీపని చూచుకొనుము. నేను యీాతనివద్ద నుండెదను."

కమల మెల్లగ లోనికరిగెను మోహనరావా చావడినంతయు నొకపరి దిలకించెను. మూయంబడియున్న రెండు కిటికీలను తెరచెను. శ్రీనివాసరావును దిలకించెను. ఆతండు రోగపీడితుండయ్యును కళా ప్రపూర్ణానననుండై యుండెను. శరీరము కృషించిపోయినను కాంతి యిసుమంతయు తగ్గలేదు. మోహనరావించుక శాంతినొందెను. వసారాలోనున్న కుర్చీలో కూర్చుండి శ్రీనివాసరావువైపు తదేక దృష్టితో చూడసాగెను.

శ్రీనివాసరావించుక కదలి కనులువిప్పిచూచెను. ఎదుట కుర్చీలో మోహనరావు కూర్చుండి యుండెను. ఆతని బాగుగా పరిశీలించి మందస్వరముతో, "మోహనరావూ!" అని పలుకుచు లేవంబోయెను కాని యాతనికి లేచుటకు సత్తువ చాలినదికాదు. మోహనరావాతని వారించుచు చటాలున కుర్చీపై నుండి లేచి యాతని మంచముకడకు వచ్చెను.

"శ్రీనివాస్! ఎట్లున్నది?"

"జీవింతునను యాశలేదు."

"భయములేదు. అధైర్య మందకుము. నేను వచ్చునప్పుడే సమర్థుడగు నొకవైద్యునిగూడ మాటలాడి వచ్చితిని. కొలదిసేపటి లోనే నాతండు రాంగలండు."

ఆమాటలువిని లోపలనుండి కమల వచ్చెను. దీనవదనయై యించుక దూరముగ నిలువఁబడి, "అన్నా! ఎట్లున్నది?" అనెను.

"అమ్మాయీ! మరేమియు భయములేదు. నీవుపోయి భుజించిరమ్మా. శ్రీనివాసరావునకు పాలు మాత్రమే యొసంగ వలయును."

"నాకాకలిలేదు. నిద్రాహారములకు దూరమయి యారు దినము లయినది. మరల యాయన కాలు క్రింద బెట్టినఁగాని నా కన్నము రుచింపదు."

"అట్లుకాదు తల్లీ! నామాటవిను. నీభర్తను బ్రతికించు భారము నాయది. వెళ్ళి కొంచె మెంగిలి పడకున్న పడిపోయెదవు. వేసవికాలము."

మోహనరావు బలవంతముపై నామె లోనికి బోయెను. కాని యామె భుజించెనో లేదో చూచువారెవ్వరు? ఆయింట మోహనరావు వచ్చువరకును కమలా శ్రీనివాసరావులు దక్క వేరెవ్వరునులేరు. అందుచే పాపము కమల కిరువదినాలుగంటలు భర్తృసేవయందే గడచి పోవుచుండెను. ఇక నామెకు వంట చేసుకొనుటకుగాని, భుజించుటకు గాని తీరికలేక పోవుచుండెను. ఏహోటలునుండియైన భోజనము తెప్పించి యామెను భుజింపుమను వారుగూడ లేరు. శ్రీనివాసునకు తల్లివంకవారు, తండ్రివంకవారు చాలమంది బంధువులు గలరు. వారందరకు నిరుగుపొరుగువారిచే కమల యుత్తరములు వ్రాయించెను. కాని వారొక్కరును రాలేదు. కమలకు దగ్గర బంధువు లెవ్వరునులేరు. తల్లి చిన్నప్పుడే గతించెను. తల్లిపోయిన తరువాత తండ్రి యుండియు లేనివారిలో లెక్కయే. ఇక నామెకు గష్టకాలమున నడ్డుపడు వారెవ్వరు గలరు? మోహనరా వీ విషయములన్నియు బాగుగ నాలోచించి లోనికిబోయి చూచెను. నాడుమాత్రము కమల మోహనరావు

కొఱకు వంటచేసెను. ఆమె మోహనరావు కోపించునేమో యను భయమున నాయన్నమును విస్తరిలో నుంచుకొని కూరుచుండెను. కాని యొక్క ముద్దయైన భుజించుట కామెకు మనస్కరింపలేదు. మోహనరావయ్యది గాంచి మెల్లన నామె పజ్జను గూర్చుండి, బుజ్జగించుచు, "కమలా! ఇట్లు విచారించుచున్న నోదార్చువారెవ్వరు? ధైర్యమవలంబించినం గాని కార్యము చక్కంబడదు. నీవిట్లు నిద్రాహారశూన్యవై యున్నట్లు శ్రీనివాసరావెరింగిన నాతని మనోవ్యాకులత మఱింత యధికమగును. దిక్కులేని వారలకు దైవమేదిక్కు." అని యోదార్చుచు నెట్టులో యామెచే భుజింపంజేసెను.

ఆరాత్రినుండి మోహనరావు తనకును, కమలకునుగూడ హోటలునుండి భోజనము వచ్చునట్లు యేర్పాటు గావించెను. తనశక్తి వంచనలేక శ్రీనివాసరావునకు పరిచర్యలు చేయుచుండెను. ఆహా! స్నేహమహాత్మ్యము- సర్వకాలములందును హితమును గోరువాడు గావుననే స్నేహితుండయ్యెను. శ్రీనివాస మోహనరావుల మధ్యంగల స్నేహము సామాన్యమయినదికాదు. ధనాశవలనంగాని, తదితర ప్రతిఫలాపేక్షవలనంగాని గలిగినది కాదు- అది నిర్మలము నిశ్చలము నైనది. కమల వారిరువురి స్నేహమును దిలకించి యచ్చెరవందెను.

నాల్గుదినములు గడచుసరికి శ్రీనివాసరావు వ్యాధి చాల వఱకు నివారణమయ్యెను. పథ్య మొసంగిరి. నడయాడుటకు దగిన బలమింకను చేకూరలేదు. కాని యింటిలో మెల్లగ చేతికఱ్ఱ సహాయమునం దిరుగుచుండెను. నాథుని కారోగ్యము చేకూరుటకు మోహనరావే మూలకారకుండని తలంచి కమల యాతనిని దైవమువలె పూజించుచు గౌరవించు చుండెను. ఆమెకు సోదరులు లేని లోపము మోహనరావు తీర్చివైచెను.

ఒకనాటి మధ్యాహ్నము కమలా శ్రీనివాసరావులు, మోహన రావును గూర్చుండి యేదియో లోకాభిరామాయణమును ముచ్చ టించు కొనుచుండిరి. కొంతకాలమట్లు హాస్య ప్రసంగములతో గడచిన పిమ్మట శ్రీనివాసరావు మెల్లన మోహనరావు నుద్దేశించి, "మిత్రమా నీయపార దయారస వృష్టివలన నేను జీవింపఁ గల్గితినని పల్కుట ముఖస్తుతి గానేరదు. వృద్ధులు బలగమున్నను ఒక్కరైన నాయాపద కడ్డుపడరైరి. భగవంతుఁడు నిన్ను నాతలంపునకుఁ దేకున్న నే నేమయి యుందునో! ఇప్పటికి నాశరీర వ్యాధి తగ్గినది కాని-మనోవ్యాధి యింకను కుదురలేదు. నీతో గొన్ని రహస్యము లు నుడువవలసి యున్నవి. అయ్యవి యతి నిగూఢములు." అనెను.

ఆపల్కులు చెవుల బడినంతనే మోహనరావు హృదయమున నాలోచనా తరంగము లుత్పన్నములై యాతని హృదయమును కలంచ నారంభించెను ఆ నిగూఢరహస్య మేమయి యుండును? శ్రీనివాసుని గృహపరిస్థితులనుగూర్చిన రహస్యమా? ఏమో! ఎట్లు తెలియును? ఎట్టకేలకు మోహనరావు తనమదిని కుదురు పఱచుకొని "ఏమా నిగూఢరహస్యము?" అనెను.

శ్రీనివాసరావు యేదియో చెప్పఁబోయెను. ఇంతలో వీధి తలుపు తెఱచుకొని సరోజని లోనఁ బ్రవేశించి వారి సంభాషణ కాటంకము గల్గించెను. ఆమె చిరునగవు మొగమున తాండవింప, "డి.................."

మోహనరా వావైపు తిరిగి పెదవి కరచుకొని ముఖము చిట్లించెను. సరోజని యించుక చకితయయ్యెను, తన మాటను గప్పి పుచ్చుకొని "డియర్. మోహనరావుగారూ! గుడ్ యీవినింగ్" అనెను. సరోజని యాకస్మికముగ తన మనోగతాభిప్రాయ మితరు లెరుంగకుండ మార్చుకొనఁగలిగి నందులకు సంతసించుచు మోహనరావు

" సరోజనీ! యిన్నిదినములనుండియు నీసహాధ్యాయుని జూచుటకైన రాలేదు. " అనెను.

" క్షమింపుము. భగవంతుడు నన్ను గొన్ని చిక్కులకు లోను గావించుటచే రాజాలక పోయితిని. మీదయవలన నిప్పటికా చిక్కు లంతరించుటచే నిటువచ్చుట కవకాశము కలిగినది. "

మోహనరావు గడియారమువైపు చూచెను. నాలుగంట లయ్యెను. మిత్రునివైపుచూచి, " శ్రీనివాస్! మందుకు వేళయైనది. కమలా! లోనికి తోడ్కొనిపోయి యౌషధమునంగి కొంచెము పాల నిమ్ము. " అనెను.

కమల లేచెను. శ్రీనివాసరావుగూడ చేతికఱ్ఱ సహాయమున లేచి " సరోజనీ! ఇప్పుడే వచ్చెదను. కూరుచుండుము. " అనిపల్కి లోని కరిగెను.

" సరోజనీ! డిక్టొవుపదమువయోగింతువేమో యని చాల జడిసితిని సుమా! "

" ఏల? అందువలన బ్రమాద మేమున్నది! "

" ప్రమాద మేమియు లేదుకాని ఏదియేని యొక యభియోగమున విజయముం గాంచునట్లుగ నా కా బిరుదము సార్థకముగా నేరదు. "

" అదేటిమాట! ఒకవేళ నేయభియోగము తప్పింపకున్న? "

" పోనిమ్ము. శ్రీనివాసునకును, వానిభార్యకును, నా నూతన పదవి తెలుపవలదని మనవి. "

" మనవిగాదు. ఆజ్ఞయనిన చాల సంతోషముతో శిరసావహింతును. "

ఇంతలో శ్రీనివాసరా వౌషధసేవ గావించి సావడిలో ప్రవేశించి యచటంగల పడకకుర్చీపై కూర్చుండెను. సరోజనివైపు తిరిగి, " సరోజనీ! ఈమధ్య నూరిలో లేవా? " అనెను.

సరో:—లేదు. ఎలమంచలివెళ్ళి మొన్న మోహనరావుగారు వచ్చిన దినముననే వచ్చినాను. అప్పటినుండియు వచ్చుట కవకాశము లేకపోయినది.

శ్రీని:- సరికాని- మన పరీక్షాఫలితము లేమయినదో దెలిసినవా?

సరో:—నీకింకను తెలియనేలేదా? మీ మిత్రుఁడు మోహనరావు గారయిన చెప్పలేదా?

శ్రీని:—లేదు. నాకేమియు తెలియదు.

సరోజని మోహనరావువైపు తిరిగెను. మోహనరావు వెంటనే లేచి తన జేబులోని గెజటుతీసి యందు యూనివర్సిటీ పరీక్షా ఫలితము లున్న పుటమాత్రము వేరుగతీసి శ్రీనివాసున కొసంగెను. ఆతనిచర్య సరోజని కించుక నవ్వు కలిగించినది.

శ్రీనివాసరావు తనపేరును, సరోజని పేరునుగూడ నందుచూచి యానందించెను. ఇంకను కొందరు మిత్రుల నామములందు గాన్పించి యాతనికి సంతోషము చేకూర్చినవి.

గోడకు వ్రేలాడుచున్న గడియారము మయిదుగంటలు కొట్టినది. సరోజని లేచెను. శ్రీనివాస మోహనరావు లిరువుర నొకపరి తిలకించెను ఆమె నేత్రములందలి యభిప్రాయము మోహనరావవలీల గ్రహింపగల్గెను.

“సరోజనీ! వెళ్ళుచుంటివి గాబోలు. నీమిత్రుని శ్రీనివాస రావును మాత్రము మరువకుము. ఆతని యోగక్షేమ మఱయుట కైన వచ్చుచుందువని తలంచెదను.”

“ఆతనికొఱకే యననేల? మీకొఱకు మాత్రము రాకూడదా? తప్పక వచ్చుచుందును.

సరోజిని వెడలిపోయెను. శ్రీనివాస మోహనరావు లిరువురును నొకగదిలో ప్రవేశించి చాలసేపు ముచ్చటించిరి. వారతిరహస్యముగ మాటలాడుకొను చుండుటచే నాసంభాషణాంశ మేమియు తెలియుట కవకాశము లేదు.

## మూడవ ప్రకరణము.



వారము దినములు గడచిపోయెను. శ్రీనివాసరావు సంపూర్ణారోగ్యము నొందెను. ఎప్పటియట్ల తన వ్యవహారము లన్నియు నిర్వర్తించుకొనగలుగుచుండెను. మోహనరావుకూడ మిత్రుని కిక తన సహాయ మనవసరము లేకపోవుటచేతను, కాకినాడలో నాతనికి గొన్ని తొందరపను లుండుటచేతను మోహనరావు, తన మిత్రునికడ సెలవుగైకొని వెడలిపోవలయునని తలంచెను. ఆ వారము దినములలోను ప్రతిదిన ముదయమును సాయంకాలమునుగూడ సరోజని శ్రీనివాసరావును చూచుటకు వచ్చుచుండెను. వచ్చినప్పుడెల్ల నామె యధమ మొక యరగంటయైనను మోహనరావుతో సంభాషింపకుండ వెడలునది కాదు. తన క్రీగంటి ప్రసారములచేతను, మృదుమధురవాక్య సముదాయములచేతను నామె మోహనరావు హృదయము నాకర్షింపవలయు నని తలంచుచుండెను. భగవానుఁ డామె యత్నమున విజయ మొసంగునో లేదో?

ఆనాఁడు మధ్యాహ్న మెప్పటియట్ల మూడుగంట లగుసరికే సరోజని వచ్చెను. శ్రీనివాస మోహనరావు లొకవైపునను, కమలా సరోజను లొకవైపునను కుర్చీలపైఁ గూర్చుండిరి. కొంతసేపు లోకాభిరామాయణము జరిగినపిదప మోహనరావు మిత్రుని దిలకించి, "శ్రీని

వాన్! నేను రేపటిరోజున కాకినాడ వెళ్ళెదను. కొన్నికొన్ని తొందరి పనులు మాని నీ చెల్లెగ్రానుచూచి బయలుదేరి వచ్చితిని." అనెను.

మోహనుని పల్కులు వినినంత నందరకును తలపై పిడుగుపడిన ట్లయ్యెను. మోహనరావు వెడలిపోవుట నా రెవ్వరికిని గూడ నిష్టము లేదు. మోహనరావు శ్రీనివాసరావున కాపత్కాలమున దోడ్పడుటచే కమలా శ్రీనివాసరావు లాతని పోకడ కంగీకరింపలేదు. సరోజని యాతని చూడకుండ నుండలేకపోవుటచే నాతనిని ప్రయాణము వలదని చెప్పదలంచెను, గాని యందువలన కమలా శ్రీనివాసరావులు తన హృదయగతంబైన ప్రేమను తెలిసికొందురేమో యని భయపడి యూరకుండెను.

కమల మోహనరావును దిలకించి, "అన్నా! వచ్చినదిమొదలు నీకు కష్టము మనోవ్యాకులతయే గాని సుఖము సంతోషము లేదుకదా! ఒక వారము దినములు సంతోషంబున గాలము బుచ్చినపిదప వెళ్ళవచ్చును. ఇన్నిదినములనుండి యొక్కనాడైన కడుపార భోజనము, కన్నార నిద్రయు గూడ లేకుండ మాకొరకు శ్రమపడితివి. మే మెన్ని జన్మము లెత్తినను నీ ఋణము దీర్చుకొనజాలము. వచ్చినప్పటినుండియు ననేకగర్భజనితకష్ట నెక్క డాదరణంబున గాంచెదువాడ నగుట నిప్పుడుగూడ నా ముద్దు చెల్లింపుము." అని బ్రతిమాల సాగెను. ఆమె పలుకు లాతని హృదయమును కలంచివైచెను. ఎట్టి తొందర పను లున్నను సరియే వదలివైచి యామెకు హృదయానంద మొసంగవలయునని యాతడు నిశ్చయించుకొనెను.

సరోజనికూడ నాయనకాశమును పురస్కరించుకొని చిరునగవుతో, "రావుగారూ! అంత ప్రాథేయపూర్వకముగ బ్రతిమాలుచున్న కమల కోర్కె ద్రోసిపుచ్చుట న్యాయము కాదు." అని యూరకుండెను. మోహనరావు, " సరోజనీ! మీ యందరి యభిప్రాయము మొక్క

తీరునసేయుండ నే నెల్లు కాదని వెడలిపోఁగలను? మీయాయభిమతమెట్లో యట్లే కానిండు " అని పలికి యూరకుండెను.

ఈ పైసంభాషణ ముగియుసంతలో నైదు గంట లయ్యెను. శ్రీనివాస మోహనరావు లిరువురును షికారునకు వెడలిరి. సరోజనీ కమలలు లోనికి పోయిరి. కమల వంట ప్రారంభించెను. సరోజని యామె ప్రక్కను గూర్చుండి యిట్లు ముచ్చటింపసాఁగెను.

సరో:— కమలా! ఇప్పటికి నీ హృదయశాంతి చేకూరెనని తలంచెదను.

కమ:— నిజమే. సరోజనీ! యదార్థము చెప్పుచున్నాను. మోహనరావు వచ్చువరకు మీ యన్నగారు జీవింతురను యాశ నాకు గలుగలేదుసుమా!

సరో:— నిజమే ఐదెనా! మా నాయనగారుకూడ నట్లే చెప్పిరి.

కమ:—నిజముగ వేయిజన్మములు సేవయొనర్చినను మేమాతని ఋణము దీర్చుకొనఁజాలము.

సరో:— అన్నట్లు మరచితిని. నేను వచ్చునప్పు డెలమంచిలి స్టేషనులో నాతఁడు నాకు రెండణా లొసంగెను. అవి మరల నాతని కొసంగుటయే మరచితిని.

కమల చిరునవ్వు నవ్వెను. " రెండణా లాతను మరల దీసికొన నలయునా? "

సరో:— తీసుకొనకున్న నే నా ఋణవిముక్తి కొరకు నా జీవిత మాతని యధీన మొనర్పవలయును.

కమ:— ఒనర్చినను తప్పులేదు. ఆతఁడు నీచే సేవలందుట కనర్హుఁడా?

సరో:— ఎంతమాట! అదికాదు. అట్టి పరోపకారపారీణుని సేవించు భాగ్యము నావంటిదాని కబ్బుట దుర్ఘటము.

కమ:— ఏమో! యెవ్వరు చెప్పఁగలరు? నీవే యట్టి భాగ్యవతి వయినచో మాతో మాటలాడవు.

అంతలో నామె క్రొత్తైను. "నీ పరిహాసములకేమి లే. నాకుఁ బని యున్నది. యింటికి పోవలెను." అనుచు సరోజని వెడలిపోయెను.

మరికొంతసేపటికి శ్రీనివాస మోహనరావులు యింటికి వచ్చిరి.

రాత్రి యందఱును భుజించి నిద్రించిరి. మోహనరావు శ్రీనివాసరావు లిరువురును సావడిలో నొక మంచముమీఁదను పరుండిరి. కమల లోని గదిలో పరుండెను. అందరును గాఢనిద్రాపరవశులై యుండిరి. రాత్రి రెండుయామములు దాటిపోయెను. సావడియందును, కమల పరుండిన గదియందునుగూడ దీపములు కాంతివంతములై ప్రకాశించుచుండెను. గదిలోనుండి సావడిలోనికి వచ్చు తలుపులు తెరువఁబడియే యుండెను లోక మంతయు నిశ్శబ్దముగనే యుండెను.

అత్తరి నిరువురు మనుజులు శ్రీనివాసరావు గృహమున్న వీధిని బోవుచుండిరి. వా రిరువురునుగూడ వడివడిగ నడచుచుండిరి. వా రేదియో కార్యనిమగ్నులై యున్నట్లు వారి గమనవేగమే తెలుపుచున్నది. వా రిరువురును బయలుదేరి పోయిపోయి శ్రీనివాసుని గృహప్రాంగణము ముందు నిలువఁబడిరి. సుమా రరగంటవరకును వా రట్లే నిలిచి యా గృహమును పరిశీలింపదొడంగిరి. తరువాత వారు వెనుదిరిగి యా యింటి వెనుకవైపునకు బోయిరి. దొడ్డికిఁగల గోడ నవలీల లంఘించి వారు లోనఁ బ్రవేశించిరి. గృహద్వారము లన్నియు బంధింపఁబడి యున్నవి. వా రా తలుపు లన్నియు త్రోసి చూచిరి. తెరచుటకు ప్రయత్నించి విఫలమనోరథులైరి. లోని కరుగు యుపాయము తోచక వారు దీర్ఘాలోచనఁ గావించుచు నట్లె నిలువఁబడియుండ నాకస్మికముగ వారి కా గోడయం దొక కిటికీ కాన్పించెను. అయ్యది భూప్రదేశమునకు నాలు గడుగుల యెత్తున నున్నది. ఆ యిరువురు వ్యక్తులును యా

కిటికీని సమీపించిరి. దానితలుపులు తెరువఁబడి యుండెను. అందు కట్టి యూచ లమర్పఁబడి యుండుటచే నావ్యక్తు లవలీలగ నాయూచల నూడదీయఁగల్గిరి. ఆగవాక్ష మార్గముగుండ వారు చావడిలో ప్రవే శించిరి. శ్రీనివాస మోహనరావులు గాఢసుషుప్త్యావస్థలో మునింగి యుండిరి. మెల్లమెల్లన నడుగులిడుచు వారు మంచములను సమీపించిరి పరుండియున్న మోహన శ్రీనివాసరావుల బాగుగ పరీక్షించి చూచిరి వారు గాఢముగ నిద్రించుచున్నట్లు నిశ్చయించుకొని, యావ్యక్తు లిరువురును యినుప మందసమున్న గదిలో ప్రవేశించిరి. దుర్భేద్య మగు నాయినుపమందసము వారవలీలఁ దెరువఁగల్గిరి.

శ్రీనివాసరావు లక్షాధికారి కాఁడు, కాని యాతనివద్ద సుమారు లక్షరూపాయిలవఱకు నిలువయున్నది. శ్రీనివాసరావా ద్రవ్య మంతయు దన యినుప మందసములోనే భద్రపఱచి యుంచెను. కాని యా ద్రవ్యములో ముప్పాతికభాగము నోట్లు. నాణెముల రూప ముననున్న ద్రవ్యము సుమారు రెండువేలుండును. చోరు లినుపమంద సమును తెరచినతోడనే వారికా రొఖ్ఖము కండ్లఁబడెను. వారా పైకము చప్పుడుకాకుండ మూట గట్టుకొనిరి. తరువాత నందొకవ్యక్తి మందసము లోపలి యఱ తెరచెను. ఆయఱలోఁ గొన్ని కాగితములు కట్టగా కట్టఁబడియున్నవి. ఆవ్యక్తి యా కాగితములకట్టను పైకితీసి దీపమువెలుగున చూచెను. దానిపై నెఱ్ఱసిరాతో వ్రాయఁబడిన యక్ష రములుండెను. ఆయక్షరములు చూచినంతనే యాతనిముఖము వికసించెను వెంటనే యాకట్టను తన యంగీజేబున నిడుకొని రెండవవానికి సంజ్ఞఁ గావించెను. ఇరువురును చటాలున వీథిద్వారము తెఱచుకొని వెడలి పోయిరి.

అప్పటికి సుమారు మూడుగంటలయ్యెను. శ్రీనివాస మోహన రావులు, కమలయుఁగూడ నింకను నిద్రించుచునే యుండిరి. దుః

దృష్టదేవత వారినెత్తిని తాండవ మాడుచుంత వారికి మెలకువ యెట్లు వచ్చును! తెల్లవారువరకు నాముగ్వురిలో నొక్కరును లేవలేదు.

వాడుకచొప్పున కమల యయిదుగంటలగుసరికి నిద్రనుండి మేల్కాంచి సావడిలోనికి వచ్చిచూచెను. తనభర్తయు, నాతని మిత్రుఁడునుఁగూఁడ నిద్రించుచునే యుండిరి. సింహద్వారము తెరువఁబడి యుండెను. ఆదృశ్యము కమలకు భీతి గల్గించెను. నోటమాట వెడలుట లేదు. కాలుసేతులు కంపింప నారంభించెను. ఆమె భయాకులయై శిలా ప్రతిమవలె నట్లె నిలచిపోయెను. ఎవ్వరో చోరులు తనసొమ్ము నపహరించుకొనిపోయి యుందురని యామె కనుమానము గలిగెను. తోడనే యామె యినుప మందసమున్న గదికడకు పరుగిడెను. ద్వారము సమీపించినంతనే తెరువఁబడిన యినుపపెట్టె యామె కండ్లఁబడెను. ఆమె కెవ్వుమని యొక్క కేకవైచెను.

ఆకేక కదలివసి శ్రీనివాస మోహనరావులు లేచిరి. నిర్జీవ ప్రతిమవలె నిలువఁబడియున్న కమలకడకు పరువెత్తిరి. శ్రీనివాసరావు దృష్టి నాయినుపపెట్టె యాకర్షించెను. ఆతఁడు పెట్టెను సమీపించెను. లోపలియర తెరువఁబడి యుండెను. అందు తానిడిన కాగితములకట్ట లేదు. "సర్వనాశన మైనది." అని పల్కుచు నాతఁడు మొదలు నరకిన కదళీతరువువలెఁ గూలిపోయెను. ఆతనిముఖము వివర్ణ మయ్యెను.

మోహనరావు చటాలున పడిపోవుచున్న శ్రీనివాసరావును పట్టుకొని, "మిత్రమా! ఏమయినది?" అనెను.

"ఏమున్నది. ఏవస్తువును నేను ప్రాణాధిక్యముకన్న నెక్కుడుగ దలంచి కాపాడుకొనుచుంటినో యా నా గుప్తధనసంబంధమయిన కాగితములకట్ట మాయమయినది. రొక్కము పోయినందులకు నేను

విచారింపను—కాని—కాని మోహనరావూ! అబ్బా! నాకు మతి పోవుచున్నది. హృదయము భిన్నమగుచున్నది. అక్కటా! అట్టియమూల్యవస్తువును బోఁగొట్టుకొని జీవించుట దుర్ఘటము—"

శ్రీనివాసరావిక మాటలాడలేక పోయెను. దుఃఖపరవశుఁడై యున్న యాతని నోదార్చుచు మోహనరావు, "శ్రీనివాస్! శేల వాలెనిట్లు విలపించెదవేల? ధైర్య మవలంబింపుము. గతించినదానికి వగచిన లాభములేదు. నీయపహృత సంపత్తును మరల నేను నాప్రాణములైన ధారవోసి నీయధీన మొనర్తును. కాని ఒక్కవిషయము-నీవీ విషయ మెవ్వరికిని యెఱింగింపరాదు. కమలా! నేచెప్పునది వినుచుంటివా? మనవస్తువు మనచేతులఁ బడువఱకు ప్రభుత్వమువారికా కాగితముల విషయ మేమాత్రము తెలియుట సంభవించినను బ్రమాదము తటస్థించును." అని పలుకుచు నాతఁడా యినుపమంగసమును బాగుగ పరిశీలింప సాఁగెను

కమలా శ్రీనివాసరావు లట్లే నిలచిపోయిరి. వారినోట మాట లేదు. దృష్టిమాత్రము నిశ్చలముగ నాపెట్టెవంకనే యున్నది. ఇంతలో సరోజినివచ్చి యాస్థలమున నిలచెను ఆమె కమలను పిలచువఱకు నా ముగ్వురును గూడ యామెను చూడలేదు. సరోజిని కమలను సమీపించి, "కమలా! ఏమిటిట్లు పరీక్షించుచున్నారు?" అనెను.

కమల మాటాడలేదు శ్రీనివాసరావు వెనుదిరిగి చూచెను గాని యాతని నోటివెంటగూడ మాట వెలువడలేదు. మోహనరావుమాత్రము, వంచినతల యెత్తకయే, "యేమియు లేదు. పెట్టెస్ప్రింగొకటి పోయినది. దానిని బిగించుచుంటిని." యనెను.

ఆ ప్రత్యుత్తరము సరోజినికి తృప్తికరముగలేదు. కాని యామె యెందుచేతనో తిరిగి ప్రశ్నింపలేదు. సరోజిని వచ్చుటతోడనే నామె నచట నుంచరాదని తలంచి కమల సరోజినిని వెంటబెట్టుకొని లోని

కరిగెను. సరోజని కమలమూలమున రాత్రి జరిగిన దంతయు చెప్పింప వలయునని తలంచెను కాని-కమల హృదయమున మోహనరావు నుడివిన ప్రత్యక్షరము భీకరముగ ప్రతిధ్వనించుచుండుటచే నామె మోహనరావొసంగిన ప్రత్యుత్తరముకంటె నెక్కుడేమియు సరోజని కెరింగించి యుండలేదు. సరోజని నిరాశజెంది యూరకుండెను.

కమలాసరోజనిలు వెడలిపోయినపిదప శ్రీనివాసరావు మంచమును వదలి యీవలకువచ్చి దంతధావనాది నిత్యకృత్యముల నిర్వర్తించుకొనియెను. మోహనరావా పెట్టెను బాగుగ పరిశీలించెను కాని యందాతని కనుకూలించు వస్తువు లేమియుఁ గాన్పింపలేదు.

కమల కాఫీ తయారుచేసెను. నలువురును కాఫీ తీసికొనిరి. కమలకు ధనము పోయినట్లేగాని యమూల్యమయిన కాగితము లపహరింపఁబడుట తెలియదు. అదికూడ కొంత మేలే జరిగెను. స్త్రీలు రహస్యమునుఁ దాచలేరుగదా! కాఫీ తీసికొనినపిదప శ్రీనివాస మోహనరావు లిరువురు నెచటికో వెడలిరి. కమల వంటయత్నమునకుఁ జనెను. సరోజనికూడ వంటయింటఁజేరి కమలతో సంభాషణ కుపక్రమించెను.

సరో:— కమలా! మోహనరావు చాల గంభీరహృదయుఁడునుమా!

కమ:— ఎందుచేత నట్లనుచున్నావు?

సరో:—ఏమియు లేదు. ఇంతకుముందు నేనడిగిన ప్రశ్నకెట్లు ప్రత్యుత్తర మొసంగెనో వింటివా? సూ పోయినదట! అంతమాత్రమున కింటనున్నవా రందరు నచ్చట నెందుల కుందురు? అసత్యమాడి నను అతుకుకొనవలయునుగదా!

కమల మాటలాడలేదు. మోహనరావు సమాధానము సరోజని మనసునకు నచ్చలేదని యప్పుఁడామె తెలసికొనెను.

సరో:-పోనీ కమలా! నువ్వు ఆలోచించుము. అప్పుడు శ్రీనివాస రావు నీవుకూడా విభ్రాంతపడిపోయి నిలువబడితిరిగదా! స్త్రీ పోయినంత మాత్రమున నంత నివ్వెరపాటు గలుగునా?

కమ:—సరోజనీ! నీకడ దాపరిక మెందుకు? నిన్నరాత్రి యెవ్వరో యింట బ్రవేశించి యినుప సందసమును తెరచి యందులో నున్న సుమారు రెండువేల రూపాయిలు సంగ్రహించిరి.

సరోజని యాశ్చర్యమందెను రెండువేలు. ఒకటిగాదు రెండుగాదు- రెండువేల రూపాయలు. ఈకాలపరిస్థితులనుబట్టి యొక మానవుడు తనకుగావలసిన ఖర్చులన్నియు జరుపుకొనుచు రెండువేలు నిలువ చేయుట సామాన్యమా! ఆమె హృదయము విచారగ్రస్థమయినట్లు ముఖమునందు గోచరించుచుండెను. గాని యద్దానిని కమల మాత్రము గ్రహింపలేక పోయెను. పదిగంటలవరకు సరోజని యామెతో మాటలాడుచునే యుండెను.

పదిగంటలు దాటినంతనే శ్రీనివాస మోహనరావులు వచ్చుటచే సరోజని మరల మధ్యాహ్నము వచ్చెదనని చెప్పి వెడలిపోయెను.

---

# నాల్గవ ప్రకరణము.



సరోజని గృహము శ్రీనివాసరావు యింటికి సమీపముననే యున్నది. ఆమెతండ్రి శ్రీనివాసరావుకంటె చాల పేదవాడయ్యును ధనికునివలెగాన్పించును. నివసించుటకు చక్కనిమేడ, ఎచ్చటకైన బోవలసివచ్చినచో కారు, ఆతడు మహదైశ్వర్య సంపన్నుడను వాడుక విశాఖపట్టణమంతయు వ్యాపించెను. ధనముమాట యెట్లు

న్నను యాతఁ డూరఁగల ప్రభుత్వోద్యోగుల చేతను, యితర పెద్ద మనుష్యులచేతనుఁగూడ గౌరవింపఁబడుచుండెను. ఆతనిపేరు మాధవ రావు. వయసు యేబది సంవత్సరములు దాటినను యాతని శరీరపటుత్వము మాత్ర మింకను తగ్గలేదు.

ఒకనాటి మధ్యాహ్నమాతఁడు తన వీధిసావడిలోఁగల కుర్చీపై కూర్చుండి చుట్ట కాల్చుకొనుచు ఇండియన్ ఎక్స్‌ప్రెస్సు పేపరు చూచుకొనుచుండెను. అంతలో నొక మహమ్మదీయుఁడు లోన ప్రవే శించి, " మాధవరావుగారు మీరేనా? " యనెను.

" అవును. ఎందుకు? "

మహమ్మదీయుఁడు సవినయముగ మాధవరావునకు సలా మొనర్చెను. మాధవరావుకూడ నాతఁ డొసంగు యభివందనమునకు ప్రత్యభివందన మొనర్చి యాతనినొక యాసనమునఁ గూర్చుండఁ జేసెను. తరువాత వారిరువురకును నీ క్రింది సంభాషణ జరిగినది.

మాధ:— మీ దే యూరు? మీ పే రేమి?

మహ:— మాది కాకినాడ. నా పే రబ్దుల్ ఖాను.

మాధ:— ఇచ్చట కేమి కారణమున వచ్చితిరి?

మహ:— ఈ యూర శ్రీనివాసరా వను యొక ధనవంతుఁడు గలఁడని వినియుంటిని. నేను దూరదేశమునుండి శోఖ్ఖ్ము న్నగునవి తెప్పించి వాటిని బాగుచేయించి పలుగకముల పాదరక్షలు తయారు చేయించి మరల నెగుమతిచేయుచుందును. అందులకు నాకు కొంత ధన మావశ్యక మగుటచే వారిని కలసికొని వారి సహాయము కోరవలెనని తలంచితిని. ఓడ మన రేవులోనే యున్నది. ప్రస్తుతము రెండువేలు కావలయును.

మాధ:— అటులైన నా శ్రీనివాసరావుగారి యిల్లు యీ వీధినే నాలుగిండ్లు దాటినతరువాత నున్నది. అచ్చటికి వెళ్లుము.

మహ:— అట్లుకాదు. ఆయనకు మీ మాటయం దెక్కుడు గౌరవమని విన్నాను. అందుచే మీరు కొంచెము వారితో నా విషయము చెప్పి నాకీ యుపకారము చేయింపవలయును.

లోపల గదిలో తల దువ్వుకొనుచున్న సరోజని యీ సంభాషణ మాలకించెను. కిటికీగుండా తనతండ్రితో నింకొక మహమ్మదీయుఁడు మాటలాడుచుండుటఁ గాంచెను.

మాధ:— నేను చెప్పుట కిది సమయముగాదు. చెప్పినను లాభించదని నా తలంపు. ఏమందురా? మొన్ననే వారి యింట దొంగలు పడి రెండువేలు రొఖ్ఖము, యింకను యేవేవియో నగలు మున్నగునవి యపహరించిరని విన్నాను. ప్రస్తుత మాతనియొద్ద నేమియు నిలువ యుండదనియే నా యూహ.

సరోజని యీ మాటలు విని నివ్వెరపడెను. మరల నా మహమ్మదీయుని పరికించెను. ఆతనియెడ నామె కించుక యనుమాన ముదయించెను. ఆతఁడు కృత్రిమరూపధారివలె నామెకుఁ దోచెను. శ్రీనివాసుని ధనమంతయు నాతఁడే దోచుకొనిపోయి యుండుననియు, నింకను నాతనికడనున్న ధనవివరము తెలసికొనుటకై యట్లు బయలుదేరి వచ్చియుండుననియు తలంచెను. కాని తన యనుమానమునకుఁ దగిన నిదర్శన ముండవలయునుగదా! ఆమె చాలసేపాలోచించి తల పంకించుచు నీవలకువచ్చి మాధవరావుఁ దిలకించి, “ నాన్నగారూ! శ్రీనివాసరా వూరిలో లేడట! ఒకసారి కమలను చూచి వచ్చెదను ” అనెను. మాధవరావనుజ్ఞా సూచకముగ తలయూచి మహమ్మదీయుని వైపు దిరిగెను. “ వింటిరిగదా! అయన యూరిలో లేరట. వచ్చిన తరవాత మాటలాడవచ్చును. ” అనెను. మహమ్మదీయుఁడును తన ప్రయత్నము విఫలమైనందులకు విచారించుచు సరోజనివైపు తిరిగి- “ అమ్మగారూ! ఆయన యెప్పుడు వచ్చెదరో తెలియునా? ” అనెను.

సరోజని యాతనితో మాటలాడుటకు నసహ్యము పొడచెను. ఆమెముఖము చిట్లించుకొనుచు, "ఏమో తెలియదు" అని జవాబొసంగి యచ్చోటువాసి శ్రీనివాసరావు గృహమువైపునకు నడువసాగెను.

సరోజని శ్రీనివాసరావు గృహము చేరసరికప్పుడే మోహనరావు వీధిమెట్లను దిగుచుండెను. ఆత్రముతో వచ్చుచున్న సరోజనిని దిలకించి, మోహనరావక్కడే నిలువంబడిపోయెను. సరోజని యాతని సమీపించి, "మోహనరావుగారూ! మీ ప్రయాణ మాటంకపఱచినందులకు క్షమింపుండు. ఒక ముఖ్యవిషయము మాటలాడవలసియున్నది. లోనికి వచ్చెదరా?" అనెను. మోహనరావు ప్రత్యుత్తరమొసంగకయే వెనుకకు మరలెను. ఇరువురును సావడిలో ప్రవేశించి కూర్చుండిరి.

"మోహనరావుగారూ. శ్రీనివాసరావెక్కడ?"

"కాలేజీకి వెళ్ళినాఁడు."

"ఎంతసేపయినది?"

"ఒకగంట."

"సరే! మీయూరిలో తోళ్ళవ్యాపారముచేయు సాహెబు నెరుంగుదురా?"

మోహనరావాలోచింప సాఁగెను. అతని కేమియు స్ఫురింపలేదు. కాకినాడలో మహమ్మదీయు లెవ్వరునుఁగూడ తోళ్ళవ్యాపారము చేయుట యాతఁ డెరుంగడు. ఏమో! అంతపట్టణములో నెచ్చటనైన నుండకూడదా?

"నే నెరుంగను. ఉండిన నుండవచ్చును. అయిన నిప్పు డెందులకు?"

" అగత్య ముండుటచేతనే యడుగుచుంటిని. రెండుగంటల క్రిందట మాయింటికొక మహమ్మదీయుఁడువచ్చి, తనది కాకినాడ యనియు, పేరబ్దుల్ ఖాననియు, తోళ్ళవ్యాపారమనియు, ఓడలోనివర్తు దిగుమతి చేయించుకొనుటకు రెండువేల రూపాయిలు కావలయుననియు యాద్రవ్యము శ్రీనివాసరావుచేత నప్పుగ నిప్పింప వలసినదనియు ప్రార్థించెను. నా జనకుఁడు మొదట నేమియుఁ దెలియదనెను. కాని తరువాత నాతఁడు కొంచెము మెత్తఁబడెను. ఆ మహమ్మదీయుని జూచిన నాకించుక యనుమాన ముదయించినది. ఎందులకైనను మంచి దని శ్రీనివాసరావూరిలో లేడని చెప్పి యిచటకు వచ్చితిని. జరిగినదిది. ఆమహమ్మదీయుఁ డెవ్వఁడో నే నెరుఁగను. "

" సరోజనీ! వాఁడిప్పుడు మీ యింటనే యున్నాఁడా? "

" ఆ! అక్కడనే యుండును. శ్రీనివాసరావు ఊర లేడని చెప్పగానే యెప్పుడు వచ్చునో తెలుసుకొనవలసినదని నా తండ్రియు నాతఁడునుగూడ చెప్పిరి. అందుచేత నేను తిరిగివెళ్లువరకు నాతఁ డక్కడే యుండునని తలంచెదను. "

" నే నాతని చూచినచో గుర్తుపట్టఁగలనేమో — అయినను ఇప్పుడు మించిన దేమున్నది? రేపుదయము శ్రీనివాసరావు వచ్చునని చెప్పు. ఇక్కడకు వచ్చినప్పు డన్నియు తెలును. "

అని చెప్పి మోహనరావు వెడలిపోయెను. సరోజని లోని కరిగి " కమలా! " అని పిలిచెను. కమల దొడ్డిలోని యరటిమానులఁ గోయుచుండెను. అందుచే సరోజని పిలు పామెకు వినఁబడలేదు. సరోజనియు వీధితలుపులు మూసివైచి పెరటిలోనికి పోయెను. సరోజనినిఁ గాంచి కమల, " వచ్చితివా! నీకొరకు చాలసేపు చూచినాము. ఇంక రావని ఇప్పుడే కాఫీ తీసుకొని, మీ అన్నగారు కాలేజీకి వెళ్ళినారు. " అనెను.

సరోజని చిరునవ్వుతో, "మీ అన్నగారెక్కడకు వెళ్ళినాడు?" అని ప్రశ్నించెను.

"నేను వచ్చునప్పటికి సావడిలో నున్నాడు. మరి యిప్పు డెక్కడకు వెళ్ళెనో తెలియదు."

సరోజని యేమియు మాటాడలేదు.

"ఎందుకు? ఆయనతో నేమయిన పనియున్నదా?"

"లేదు. ఉన్నను నాస్వంతపనిగాదు."

"ఎవరిపని?"

"మీపనియే"

"ఏమది?"

"పోయినధనము మరల సంపాదించుట కుపాయము."

కమల మోము వికసించెను. ఆకుల నొకచో పారవైచి యామె చటాలున సరోజనివద్దకు వచ్చి నిలచెను. "ఏమాయుపాయము?"

"స్త్రీలవద్ద రహస్యములు దాగవు. నీతో చెప్పను."

"నాసంబంధమైన రహస్యములు నాతో చెప్పినతప్పా? చిరకాలమునుండి స్నేహమున నొకయింటిలోని వారికన్న నెక్కు డన్యోన్యముగ మెలంగుచున్న నాకంటె నీకు మోహనరా వెక్కువవాడా?"

"అవును."

"అయిన మీరిరువురును కట్టకట్టుకొని యొద్దెన పొండి. నాకేల?"

కమల తోటలో చెట్టుక్రింద పారవైచిన యాకులం దీసికొనుటకు పోబోయెను. సరోజని యామె చేయిపట్టుకొని, "కమలా! కోపమువచ్చినదా? నీవద్ద నాకు రహస్యములుండునా? మధ్యాహ్నమొక మహమ్మదీయుడు శ్రీనివాసరావునుగూర్చి యొకరితో మాటలాడుచుండుట వింటిని. ఆతడు నూతనుడు. అందుచే నాతనియెడ

నాకనుమానము పుట్టించినది. వారి సంభాషణ నేను పూర్తిగా వినుటకు వీలులేకపోయినది. కాని ఆతఁడు రెండవవానితో తనది కాకినాడయని చెప్పుటమాత్రము స్పష్టముగ వినఁగల్గితిని. మోహనరావుగారిదికూడ కాకినాడకాదా! అందుచేత నాతనికి వారెరుఁగుదురేమోయని తలంచి వారితో తెలుపవలయునని వచ్చితిని. ”

ఇరువురు లోనికివచ్చిరి. సరోజని కొంతసేపటి కూర్చుండి కమలతో చెప్పి తనగృహమునకు వెడలిపోయెను.

# ఐదవ ప్రకరణము.



సరోజనితో సంభాషించినపిమ్మట మోహనరావు వెడలిపోయెనని నుడివియుంటిమిగదా! ఆతఁడు వీధిమెట్లుదిగి యెచటకు పోవుదునా యని యాలోచించుచుండెను. మాధవరావుగారి యింటికరిగి యా నూతన మహమ్మదీయుఁ డెవ్వఁడో తెలిసికొనుటయా? లేక కాలేజీకి పోయి సరోజని తనకెఱింగించిన సంగతుల నాతనితో చెప్పుటయా! ఇట్లాలోచించుచు మాధవరావుగారి యింటివైపు దృష్టి సారించుసరికి వారి యింటిలోనుండి సరోజని నుడివిన మహమ్మదీయుఁ డీవలకు వచ్చుచుండెను. వానిని చూచినంతనే మోహనరావున కాతని వెంబడింపవలెనను యూహ పొడమెను. వెంటనే యాతఁడా మహమ్మదీయుని వెంబడించెను.

అప్పటికి సాయంకాల మయిదు గంటల దాటిపోయెను. ఒక గంట ప్రొద్దుకన్న నెక్కువలేదు. మహమ్మదీయుఁడు కారుష్టాండు వద్దకు వచ్చియచటనుండి వాల్టేరు పోవు బస్సులో నెక్కికూర్చుండెను. మోహనరావు తురుష్కుఁడు వాల్టేరు వెళ్ళుచున్నాఁడని గ్రహించెను

మోహనరావు బస్సును సమీపించుసరి కాతురుష్కుడాతని వైపు నిశ్చ యముగ చూడసాగెను. మోహనరా వదికని పెట్టి. "అయ్యా! ఏమట్లుచూచెదరు?" అనెను.

"ఏమియు లేదు మిమ్మెక్కడనో చూచిన జ్ఞాపక మున్నది అందుచే చూచుచుంటిని."

"నన్ను చూచియుంటిరా. అసంభవము మీరు పొరబడు చున్నారు నే నీ యాంధ్ర దేశమునకు వచ్చుట కిదియే మొదటిసారి. అందున నేను వచ్చి మూడు దినములు మాత్రమే యైనది."

"మహమ్మదీయుడు నిజమే యనుకొనెను. అతడు మోహన రావును చాలమార్లు తిలకించి యుండెను. కాని యప్పటికిని యిప్పటికిని వేషమున జాల మార్పు గాన్పించుటచేత మనుజుని బోలిన మనుజు లుండవచ్చునని యెంచి యామహమ్మదీయుడూరకుండెను. కాని మోహన రావు మాత్ర మాతని నూరకుండ నీయలేదు.

"నబాబుగారూ! మీ దేయూరు?"

"కాకినాడ."

"ఇప్పుడు కాకినాడయే వెళ్లుచుంటిరా?"

ఆప్రశ్న కావ్యక్తి చకితుడయ్యెను తానెన్నడాప్రాంతమునకు వచ్చియుండ లేదని నుడివిన మోహనరావు కాకినాడ మున్నగు పట్టణముల విషయ మెట్లెరుంగ గలిగెనా యని యనుమానించెను చమత్కారముగ మోహనరావున కిట్లనెను "కాకినాడ వెళ్లుటకు ఓడమీద వెళ్లవలయును గాని నాటుమార్గము లేదు."

"అటులనా! నాకు తెలియక యడుగుచుంటిని. కాకినాడ వెళ్లుట కెన్నిదినములు పట్టును?"

"వారముదినములు పట్టును."

ఇంతలో కారుకు జనము పూర్తియైరి. కారు డ్రయివరు వచ్చి

కారు నడుపుటకు ప్రారంభించెను. మహమ్మదీయుడు కారులోనుండి సలాము హాజరత్!" అనెను. కారుకగలి రయంబున దృష్టిపథము నుండి దాటిపోయెను.

కారు వెడలిపోయిన పిదప సరోజని యామహమ్మదీయుని యెడ ననుమానించుటకుఁ గారణము లేకపోలేదని గ్రహించెను. ఆ మహమ్మదీయుఁడు గూడ తన్ననుమానించియే మోసగింపవలయునను దురుద్దేశముతోడనే యాతడట్లు మాటలాడెనని గూడ గ్రహించెను తా నాతని నెన్నడును చూచియుండలేదు కాని యాతఁడు తన్ను చాలసారులు చూచిన ట్లాతని దృష్టివలన తెలియవచ్చెను. మోహన రావాలోచనలకు లోనయ్యెను. కారు వెడలునప్పుఁడు డ్రయివరుతో నామహమ్మదీయుని గమ్యస్థానమును కనిపెట్టి తనకుఁ జెప్పుమని చెప్పినఁ బాగుండు ననుకొనెను. అట్లు చేయుటకు తన యధికారమును వెల్లడించినఁ గాని యాతఁ డంగీకరింపఁడు అథమము మోహనరావు కారు నెంబరైనను చూచి యుండవలసినది. అట్లుకూడ చేయలేదు. అనుమానింపఁ దగిన వ్యక్తిని వదలివేసి నందులకు మోహనరావు చాలచింతించెను- ఆలోచనపరవశుఁడై యాతఁడు మెల్లగ గృహాభిముఖుఁ డయ్యెను

మోహనరావు విలుసేరునప్పటికి రాత్రి యెనిమిదిగంట లయ్యెను. అప్పటి కింకను శ్రీనివాసరా విఁటికిరాలేదు. కమల చావడిలో కూర్చుండి యేదియో పుస్తకమును చదువుచుండెను. మోహనరావును చూచినంతనె యామె పుస్తకమును సమీపముననుఁగల బల్లపై బడవైచి, "అన్నా! వారింకను రాలేదేమి? అనెను."

అప్రశ్న మాతని కాశ్చర్యము గల్గించినది శ్రీనివాసరా వెన్నడును చీకటిపడువరకు తిరుఁగువాఁడు కాడు. అందులకు గారణ మింట పెద్దదిక్కు లేక పోవుటయే. కమల రాత్రిపూట యొంటరిగ నావిశాల గేహమున నుండుటకు భయపడునని యాతఁ డనుదిన మారుగంటలకే

తిరిగివచ్చును. నాడాలస్యమగుటకుఁ గారణ ముండితీరవలయును. మోహనరా వాలోచనా నిమగ్నుడయ్యెను.

కమల నిరుత్తరుఁడై నిలువఁబడిన మోహనరావును తిలకించి, "అన్నా! అట్లు తెల్లబోయెదవేల? మీరిరువురును కలసికొననే లేదా? ప్రతిదినమును దీపములు పెట్టకపూర్వమే వచ్చెడివారు." అనెను.

"అందు చేతనే నాకింత యాలోచనము. ఆలస్యమునకు గారణ ముండవలయునుగదా! కమలా! నీవొంటరిగ నుండగలవా? నేనాతని వెదకికొని వచ్చెదను."

అంతవఱకు ధైర్యముతోనున్న కమల కప్పుడధైర్యము తోచినది. ఆమె యధైర్యమును మోహనరావు కనిపెట్టి, "కమలా! మాధవరావుగారి యింటికివెళ్ళి కూర్చో." అనెను

కమ:—వలదు. నీవు వెళ్ళి సరోజనితో చెప్పి నామె నిక్కడకు పంపుము.

మోహ:—ఆమెతండ్రి యంగీకరించునా?

కమ:— ఇతరులవిషయ మెట్లులున్నను, మావిషయమున నాతఁడెట్టి యాటంకమును గలిగింపడు.

మోహనరావు సరేయని పలికి వెడలిపోయెను. అతడు వెడలి పోయిన అయిదునిముసములకే సరోజని వచ్చెను. కమలనుచూచి, "కమలా! శ్రీనివాసరావింకా రాలేదా? కాలేజీలో యింతవరకు యేమిపని యుంటుంది? సెలవలు. దీపాలు పెట్టేసరికి ఒక్కరూ కూడా కాంపౌండులో ఉండరుగదా" అనెను.

కమ:—ఏమో! సరోజనీ! సాయంకాలమునుంచీ కూడా నాకేమోగాని గాబరాగా ఉంది. వంట పూర్తిచేసి చావడిలోకివచ్చాను గుండెలలో మడుకు బయలుదేరింది. మనసు దిట్టపరచుకొని పుస్తకం చదవటం ప్రారంభించాను. ఎనిమిదిగంటలు దాటినపిదప మోహనరావు వచ్చాడు. అతను తిరిగి వెళ్ళినప్పటినుంచీ భయంగావున్నది.

సరో:—ఎందుకంత భయము? మగవాళ్ళకనేక పనులుంటాయి కొంచెము మాలస్య మయినంత మాత్రమున నింతగా నడలుటన్యాయము?

కమ:—సరోజనీ! ఆకస్మికముగా సాయంకాలము నీవు చెప్పిన మహమ్మదీయుని సంగతి జ్ఞప్తికివచ్చినది. అందుచే నాభయము మరింత యధికమైపోయెను.

సరోజని కమలకా మహమ్మదీయుని సంగతి తెలుపుట పొరబాటని యప్పుడు గ్రహించెను. మించినదాని కాలోచించిన ప్రయోజనము లేదనియు, నప్పుడు నామెకు ధైర్యముం గలుగజేసిన లాభములేదనియు నాలోచించెను. ప్రయత్నపూర్వకముగ చిరునగవు తెచ్చుకొని, "కమలా! హాస్యమున కనినమాటలు యదార్థము లనియే భావించితివా? శ్రీనివాసరావు నెన్నడును కాకినాడ వెళ్ళలేదు గదా! ఆయూరిలో నీతనికి పరిచయమున్న వెవ్వరును లేరు. అట్టిచో కాకినాడనివాసి యీతనికడ కప్పుడు వచ్చునన నీవెట్లు నమ్మితివి?" అని మెల్లగ నామెను బుజ్జగించుచు భయంబుంబాపెను.

సరోజని మృదుమధుర వాక్యశ్రవణంబు వలన కమల భయంబుడిగి యామెతోగూడ సంతోషముగ సంభాషించుచు కూరుచుండెను. సరోజని యంతవఱకు కమల చదువుచున్న పుస్తకము తీసి చూచెను. అయ్యది భాగవతము. అందలి రుక్మిణీ కళ్యాణఘట్టము తెరచి చదువ నారంభించెను. కమల విశేష విద్యావతి కాకపోవుటచే నక్కడక్కడ తెలియనిచోట్ల సరోజని యామె కర్థముగూడ చెప్పుచుండెను.

రాత్రి పదునొకండు గంటలుదాటెను శ్రీనివాసరావుగాని, మోహనరావుగాని తిరిగి రాలేదు. సరోజని చదువుచుండెనేగాని యామె హృదయమంతయు శ్రీనివాస మోహనరావుల గురించియే యాలోచనలతో నిండిపోయెను. కాని యామె తన హృదయాందోళనము వెలిబుచ్చిన కమల భీతాత్మగునని యామె యూరకుండెను.

కాలము జరిగిపోవుచుండెను. క్రమమున గడియారము గంటలు గొట్టుచుండెను. పంన్రెండు, ఒకగంట, రెండుదాటెను. అప్పటివరకును గూడ శ్రీనివాస మోహనరావులజాడ యినుమంతయుఁ దెలియనేలేదు కమల భాగవతమువినుచు నట్లే పరుండి నిద్రపోయెను. సరోజనికి మాత్రము నిద్ర పట్టలేదు.

నిశ్శబ్దకాంత జగమంతయు నిండి తాండవించుచుండెను సినీమాలు, నాటకములు తిలకించుటకు వెడలిన మనుజులుగూడ తమతమ గృహముల చేరికొని సుఖనిద్రా పరవశులైరి. సరోజని యొక్కతెయే మెలకువగా కూర్చుండి శ్రీనివాస మోహనరావులగూర్చి యాలోచించు చుండెను. ఇంతలో వీధిలో బండిచప్పుడు వినబడెను. ఆచప్పుడు చెవులఁబడినంత నామె హృదయము తటతటఁ గొట్టుకొనసాఁగెను. ఎందుచేతనో? వీధివెంబడి బండ్లు పోఁగూడదా? ఆశకట ధ్వానమునకును సరోజని తత్తరపాటునకును యేమయిన సంబంధ మున్నదా? ఏమో! ఎట్లు చెప్పనగును?

బండి క్రమక్రమంబున వారి గృహమును సమీపించి యచట నిలచిపోయెను. ఆబండి నిలచుట యామె హృదయవేగమును మరింత వృద్ధిగావించెను. వీధితలుపు నెవ్వరో తట్టిన చప్పుడయ్యెను- తడఁబడు చున్న కాళ్ళతో సరోజనివెళ్ళి వీధిద్వారము తెరచెను-మోహనరావును బండివాఁడును యొకవ్యక్తిని మోసుకొనివచ్చిరి-సరోజని గుమ్మమువద్దకు వచ్చువఱకు స్మృహలేక పడిపోయిన శ్రీనివాసరావును గుర్తింపలేక పోయెను శ్రీనివాసరావును గుర్తించినవెంటనే యామె హృదయము ఝల్లుమనెను. నోట మాటలేదు. మోహనరావు బండివాని సహాయమున శ్రీనివాసరావును లోనికిం దోడ్కొనివచ్చి మంచముపై బరుండఁ బెట్టెను. బండివానికి బాడుగ నిచ్చివైచి యాతని పంపించెను. సరోజని

నాతని కుపచారములు గావింప నియమించి, మోహనరావు వెంటనే వెడలిపోయెను. సరోజని గావించిన యుపచారములవలన శ్రీనివాసరావించుక తెలివిఁగాంచెను. సరోజని మోహనరావు యనుజ్ఞ ప్రకారమాతనికి వేడిపాల నొసంగెను.

శ్రీనివాసరావు పయఃపానమునవలన నించుక శక్తిఁబొంది తాను స్వగృహమున నున్నట్లును, సరోజని తన కుపచారములు గావించుచున్నట్లును గ్రహింపఁగల్గెను. మెల్లగ నామెవైపుదిరిగి, "సరోజనీ నేనిక్కడ కెట్లువచ్చితిని?" అనెను. సరోజనియు నాతనిఁదిలకించి, "మోహనరావుగారు తీసికొనివచ్చిరి. నిన్నిచ్చట దిగవిడచి వెంటనే వెడలిపోయిరి" అనెను.

"కమలఎక్కడ?"

"నిద్రించుచున్నది. లేపనా?"

"వలదు వలదు. నాయీయవస్థఁ దిలకించిన నామెగుండె వ్రీలిపోవును."

వారిట్లు సంభాషించుచుండగనే మోహనరావుతిరిగివచ్చి తలుపు తట్టెను. సరోజని తలుపుతీసెను. ఇరువురును శ్రీనివాసరావును సమీపించిరి.

"శ్రీనివాస్! ఎట్లున్నది?"

"నాకేమో తలపై మంటగానున్నది."

అంతవఱకును శ్రీనివాసరావు తలపైనున్న గాయ మెవ్వరును పరికింపలేదు. మోహనరావు శ్రీనివాసరావు శిరస్సును పరిశీలించెను. గాయ మంత పెద్దదికాదు. మోహనరావతని తలకు కట్టుకట్టి సరోజనిని పోయి పరుండుమని చెప్పెను. కాని యామె పరుండుట కంగీకరింపలేదు.

"మోహనరావుగారూ! ఈతనికీ గాయ మెట్లుతగిలినది?"

"నాకు తెలియదు. బహుశః యీకృత్యము నీవుచెప్పిన మహమ్మదీయునివలననే జరిగియుండునని నాయభిప్రాయము."

ఆపలుకువిని శ్రీనివాసరావు యించుక తలయెత్తి "అవును. నేను కాలేజీనుంచి బయలుదేరి యింటికి వచ్చుచుండ నీవు క్లబ్బులో నున్నావని చెప్పి యొక మహమ్మదీయుఁడు నన్ను తీసికొనిపోయెను. మెయినురోడ్డున కొంతదూర మేగినపిదప నాతఁడు నన్నొక సందులోనికిఁ గొనిపోయెను. వెంటనే నలుగురు మనుజులువచ్చి నను కఱ్ఱతో గొట్టిరి. నేను క్రిందఁ బడిపోయినాను. వారు నాజేబులన్నియు వెదకిరి. ఎందుకొరకో నాకు తెలియదు. తరువాత వారేదియో యొకమందును నాముక్కువద్దనుంచిరి. తోడనే నాకు దెలివితప్పిపోయెను. తరువాత నేమిజరిగినదో నాకు తెలియదు."

మోహనరా వాశ్చర్యపడెను. తానా మహమ్మదీయుఁడు కారుపై వెడలిపోవుట ఆరుగంటలకు చూచెను. ఆరుగంటలకు హాట్రేరు కారుమీఁద వెడలిపోయిన యా మహమ్మదీయుఁ డంతలో తిరిగివచ్చి శ్రీనివాసరావు వట్టిస్థితికి దెచ్చు టాశ్చర్యకరముగదా! ఎట్లగును? ఆ మహమ్మదీయుఁ డూరుదాటిన వెంటనే కారుదిగి వెనుకకు వచ్చి యుండఁ గూడదా? అవును. అట్లు వచ్చుటకుఁగూడ యవకాశమున్నది.

మోహనరావీ విషయములన్నియు దీర్ఘముగ నాలోచింపఁ దొడఁగెను. ఎట్టకేల కా మహమ్మదీయుఁడే యీపనిఁ గావించి యుండు నని నిర్ధారణ గావించుకొనెను. కాని యీ మహమ్మదీయుఁ డెవఁడు? శ్రీనివాసరావుపై నాతఁడంత పగబూనుటకు గారణమేమి? మోహనరావున కంతయు నగమ్యగోచరముగ నుండెను. మహమ్మదీయుఁడు తనది కాకినాడయని చెప్పెనట. మోహనరావాతనిని కాకినాడలో నెన్నడును చూచినట్లు యాతనికి స్ఫురించుటలేదు.

వారిట్లు సంభాషించుకొనుచుండగనే తెల్లవారిపోయెను. కమల నిద్రమేల్కాంచి భర్తయొక్క దుస్థితికి వగవఁదొడంగెను. సరోజని యామె నోదార్చెను. విచారభారమున మునిగియున్న కనుల కింటిపని చెప్పుట భావ్యముకాదని తలంచిగాబోలు సరోజనియే యానా డుదయమున కాఫీ వంట మున్నగునవన్నియు తయారుచేసెను.

---

## ఆఱవప్రకరణము.



సరోజని తండ్రి సామాన్యసంసారియని యీవరకే చెప్పి యుంటిమి, అతని కిరువురు కుమారులు, ఒకకుమార్తె. కుమారు లిరువురునుఁగూడ బి. ఏ. పూర్తిగావించి బి. యన్. ఆర్. రైల్వేలో యుద్యోగములు సంపాదించిరి. కూతురుపేరు సరోజని.

మాధవరావు పూర్వాచార పరాయణుఁడు. తదితర విషయములలో నెట్లున్నను, వివాహ విషయమున పెద్దల యాచారమును దాటుట కిచ్చగింపక సరోజని కెనిమిదవయేటనే పెండ్లి గావించెను. ఆవివాహము సరోజని యన్నల కెంతమాత్రమును యిష్టములేదు. వివాహము నాపుచేయవలయునని వారిరువురును చాల ప్రయత్నించిరి కాని తండ్రిమాట కెదురాడలేక వారూరకుండిరి.

కాని సరోజని యావివాహము వలన నిసుమంతయు సుఖపడ లేదు. వివాహమైన సంవత్సరమునకే యామెభర్త మరణించెను. భర్త పోయినపిదప నామెను పెద్దన్నగారు తన యుద్యోగపుటూరు తీసికొని పోయి యచట నాంగ్లభాష నేర్పించెను. రెండుమూడు సంవత్సరములు

గడచుసరికే యాతఁడామెకు బాగుగ నాంగ్లభాషలో ప్రవేశముఁ గల్గించెను. స్కూలులోచేర్చి చదివించుట ప్రారంభించెను. అందువలన తండ్రికిని కుమారునకును మనస్పర్ధలు ప్రారంభమయినవి. మూడు సంవత్సరములవఱకు వారిరువురును యొకరితోనొకరు మాటలాడుకొన లేదు. స్త్రీవిద్య కులాచార విరుద్ధమని తలంచి మాధవరావు కుమార్తెను గూడ తన గృహమునకు రానీయలేదు. ఇరుగుపొరుగువారి ప్రోద్బలంబున సరోజని పదునైదవయేట నాతడు స్వయముగ కుమారునికడ కరిగి, సరోజనిని విశాఖపట్టణము తీసుకొనివచ్చెను. అప్పటికి సరోజని స్కూలుఫైనలుక్లాసు చదువుచుండెను. అప్పటినుండియు నామె విశాఖపట్టణముననే జనకునింటనుండి విద్యాభ్యాసముఁ గావించుచుండెను.

సరోజని కిప్పుడిరువది వత్సరములు నిండెను. వారి గృహ పరిస్థితు లెరింగినవారుగాని సరోజని వివాహితయని యెరుంగరు. ఆమె వినయధురీణయై యలరారుచుండుటచే నందరును యామె నెక్కుడు యాదరించుచుండిరి.

నాఁడు సరోజని యెలమంచలి స్టేషనులో మొయిలు నెక్కినప్పుడు మోహనరావును తిలకించినది మొదలు యామె యెన్నఁడెరుంగని మనోవికారమునకు లోనయ్యెను. క్రమక్రమంబున నామె యాతని యెడ బద్ధానురాగయై వారము దినములు గడచుసరికే యాతనిఁజూడకుండ నొక్క నిముసమైన నుండఁజాలక పోయెను. అందుచేతనే యామె ప్రతిదినమును రెండుమూడుమారులు మోహనరావును తిలకించుటకై శ్రీనివాసరావు గృహమునకు వచ్చుచుండెను.

తన మనోగతాభిప్రాయముల మోహనరావునకు వ్యక్తీకరింపవలయునని సరోజని చాలసార్లు యత్నించెనుగాని సాహసింపలేకపోయెను. కాని సూక్ష్మగ్రాహియు, లోకానుభవ సంపన్నుఁడునగు మోహనరామె యుద్దేశమును గ్రహింపలేకపోలేదు.

సరోజని పునర్వివాహమునకు తనతండ్రి యంగీకరింపఁడని పూర్తిగా నెరుంగును. ఆహా! సంఘచట్టములు నవీన యువతుల కెంత దుర్భరములై పోయినవి? సరోజని యొంటరిగ తనగదిలో కూర్చుండెను. ఆమె తన భావిజీవిత మెట్లు పరిణమించునాయన్ని యాలోచించు చుండెను. పునర్వివాహ మాటంక పరుపఁబడినచో తన విద్య, తన సౌందర్యము, తనజీవితమే వ్యర్థము-ఆమె సంఘచట్టములను దూషించు చుండెను. తన్నను గ్రహించి తనజనకుని, తన సౌఖ్యమునకు మూల కారణంబయిన వివాహ యత్నమునకు ప్రోత్సాహించునట్లు భగవం తుని ప్రార్థించుచుండెను. తన సోదరునకు తన యభిమతమును వ్యక్త పఱచినచో నాతఁడు తగు యత్న మొనర్పునేమోయని యామె కొన దోఁచెను- కాని యయ్యది వ్యక్తీకరించుటెట్లు?

అన్నగారి కుత్తరము వ్రాయవలెనని తలంచెను ఎట్లువ్రాయవలెనో యామెకు బోధపడలేదు. కాగితము కలము చేతబట్టుకొని యాలోచింప సాఁగెను. ఎట్టకేల కామె యుత్తరము నిట్లు పూర్తిగావించెను.

" అన్నగారికి నమస్కారములు——

మేమందఱమును సుఖముగ నున్నాము. నాభావిజీవిత సౌఖ్య మునుగూర్చి నీతో కొన్నివిషయములు మాటలాడవలసి యున్నది. దయయుంచి- నీసోదరిపై గల నీయనురాగమును వెల్లడించుకొనుట కిదియే తరుణము. ఒకసారి సెలవుతీసికొని రాఁ బ్రార్థన——

ఇట్లు,

ప్రియ సహోదరి,

సరోజని.

ఆయుత్తరమును ముగించి కవరులోనుంచి పై చిరునామా వ్రాసెను. తన యింటగల సేవకుని పిలచి యాకవరును పోష్టులో పడ వేయుమని చెప్పి యొసంగెను. సేవకుఁడు కవరుఁ గైకొని వెడలిపోయెను.

సరోజని లేచి గడియారము వంక చూచెను. పదిగంటలు కావచ్చినది. ప్రభాకరుని కిరణములు అగ్నికణంబులవలెఁ బ్రకాశించుచు మానవుల కమితమగు యుష్ణమునుఁ గల్గించి తల్లడింపజేయుచుండెను. ఆమె గది వదలి దొడ్డిలోనికేగెను. తండ్రి స్నానము చేయుచుండెను. వంట యయియుండవచ్చునని తలంచి యామె తిరుగ తన గదిలోనికివచ్చి తన యాలోచనములు వెల్లడికాకుండునట్లు యేదియో చదువుట ప్రారంభించెను.

ఇంతలో మాధవరావు స్నానము ముగించి సరోజనిని భోజనమునకు పిలచెను.

భోజనానంతరము మాధవరావు నిద్రించుటలవాటు. అలవాటు ప్రకార మాతఁడు శయనాగారము చేరెను. సరోజనికూడ పరుండవలెనని యూహించి శయనాగారము చేరెను. కాని సహజనిద్రాకాలమగు రాత్రులయందే యామెకు నిద్ర రానప్పుడు, మధ్యాహ్నము నిద్ర వచ్చునా? మంచముపైఁ బరుండి యిటునటు దొర్లుచుండెను, హృదయమున నాలోచనాతరంగములు సంచారముఁ గావించుచుండెను. తన యుత్తరమును చూచి యన్నగారు సుదర్శనమూర్తి యేమనుకొననో? భావిజీవితమును పదమునకుఁ దన హృదయంబునఁ గల భావము తెలసికొనునా? తెలసికొని కోపించునేమో? ఆతనికిఁగూడ సరోజనియందనురాగము లుప్తమయిన నిక నామె జీవితసౌఖ్యమును గాంక్షించువారీ విశాలప్రపంచకంబున లేరనియే చెప్పవచ్చును. ఈ యాలోచనలే యామె హృదయమును కలంచివేయుచుండెను

వారముదినములు గతచినను సరోజని కన్నగారివద్దనుండి ప్రత్యుత్తరము రాలేదు. సుదర్శనమూర్తిఁగూడ రాలేదు. ఆతఁడు తనపై కినుకవహించెనని సరోజని గ్రహించెను జీవితముపై నిరాశ జనించెను స్త్రీ కెన్నిసౌఖ్యములున్నను, మానవసృష్టికి మూలమగు పతిసేవాభా

గ్యము లేనిచో నా సౌఖ్యము లన్నియు నిరర్థకము లేగదా! సరోజని కన్న పానీయాదులపై మనసు పోవుటలేదు. నిద్రపట్టుటలేదు. మోహన నామాక్షరములే యామెకు తారకమంత్ర మయ్యెను. మోహనరావును దర్శించుటయే యామెకు దేవతాదర్శనము. మోహనరావుతో సంభాషించుటయే యామెకు స్వర్గసౌఖ్యము సరోజని నానాటికి కృశించి పోవుచుండెను. అప్పుడప్పుడు మోహనరావును దర్శించి సంభాషించుటయే లేకున్న నీసరి కామె యిహలోకమును వదలియుండు ననియే యూహింపవలయెను.

* * * * *

సాయంకాలము నాలుగుగంటలయ్యెను. జూన్ నెల. సూర్యుని వేడిమి యించుక చల్లారిపోయెను. వానలు ప్రారంభమై మానవుల కించుక హాయికల్గించుచుండెను. హాళికులు తమతమ వ్యవసాయారంభమగుట చాల తొందరపనులలో మునింగిపోయిరి.

అందరును సౌఖ్యము నందుచుండిరి గాని సరోజనికిమాత్రము హృదయతాపము చల్లారలేదు. చల్లారునను యాసంగూడ గాన్పించుట లేదు. సుదర్శనశాస్త్రి కుత్తరము వ్రాసి యప్పటికి నెల పదునైదు దినములు పైగాఁ గడచెను. సరోజని యొంటరిగ పూలదోటలో కూర్చుండి యుండెను.

“అక్కటా! స్త్రీజన్మము కడు చెడ్డదిగదా! హైందవచట్టములు స్త్రీసౌఖ్యమున కాటంకకరములు. ఓ భారతమాతా! నీ సాటి స్త్రీజాతి యిట్లు సౌఖ్యరహితమై తల్లడిల్లుచుండుట చూచి యూరకుండుట భావ్యమా? సంఘ సంస్కర్తలు లేరా? దేశక్షేమమునకై పాటుపడు చున్నామని బల్లలు బ్రద్దలుగొట్టు నాయకు లేమైపోయిరి. వారికి నా వంటి యనాథస్త్రీలు కాన్పించుటలేదా? స్త్రీ పునర్వివాహచట్టము మన దేశమున సుస్థిరముగ నేల నెలకొల్పరాదు? అయ్యది శాస్త్రవిరుద్ధమైనచో ముక్కుపచ్చలారని పసిపాపల ద్రవ్యానచే గాటికి కాళ్ళు

చాచుకొనియున్న ముదుసలుల కిచ్చి వివాహము లొనర్చుట నీతిదాయకములా! కటకటా! అన్నా! నీవు నా శ్రేయస్స్వామివని తలంచి నీ కుత్తరము వ్రాసితిని. లేకున్న నామనోవాంఛితము వెల్లడికాకుండగనే నా కోర్కెలతోబాటు నా జీవితమునుఁగూడ ముగించుకొనియుందునే! దాననేను మీయందరి యాగ్రహమునకుఁగురిఁగాకుండనుండి యుందునే! దైవమా! నన్ను చిన్నప్పుడే గిట్టింపక యింతకాలమేల మని యుండ జేసితివి? జీవింపచేసినను నాహృదయము దైవాత్త్వముగ నొనర్చి నాకు దివ్యజ్ఞానమొసంగక యిట్టి యైహికవాంఛలకేల గురి గావించితి? ఛీ! నాపై నలుకబూనిన నాసోదరుఁడు నాకోర్కె వెల్లడించి నలువురిలో నాకు తలవంపులు గల్గింపకపోవునా? అట్టి యపయశముతో జీవించుట కంటె మరణించుటమేలు."

అని పరిపరి విధముల చింతించుచు నెట్టకేల కాత్మహత్యఁ గావించుకొన వలయునని నిశ్చయించుకొనెను. ఆలోచనా పారవశ్యమున మునింగియున్న యామెకు కాలముగూఁడ తెలియలేదు. సూర్యుడపరాత్రి గ్రుంకిపోయెను. సరోజనితనభావనా ప్రపంచమునుండి మేల్కాంచు నరికి చీకటులు నలుదట్ల గ్రమ్ముచుండెను. ఆమె జీవితముపై నాశ వదలెను. దొడ్డిలోని నూతిలోనికి జీవనములఁ బోఁగొట్టుకొనవలెనని నిశ్చయించుకొనెను. సరోజని విద్యావతి- ఆత్మహత్య పాపదాయకమని యామెకుఁ దెలియును- తెలిసియుండియు నామె యట్టి సాహసమునకు గడంగుటలో నామె మనోవేదనాధిక్యత వెల్లడి యగుచుండుటలేదా?

పెరడు నాల్గుమూలల పరికించెను. ఎవ్వరును కాన్పింపలేదు. నిశ్శబ్దముగ నామె నూతికడకు నడచెను. తన చీరచెరగుతో నడుము గట్టిగ బిగించుకొనెను. నూతిగోడపై కెక్కెను. కనులు మూసికొనెను. తనకెన్నఁడును స్త్రీజన్మము నొసంగవలదని భగవంతుని ప్రార్థించెను.

నూతిలోదూఁక సిద్ధమగునంత, "సరోజనీ" యనుకేక యామె చెవులఁబడెను. నిరాశాతప్తమగు నామెహృదయ మాపిలుపు వినినంత, నేలకోవి కానను గాంచెను. ఆత్మహత్యఁ గావించుకొనఁ గృతనిశ్చయయైయున్న యామె ప్రయత్నమున కంతరాయము గల్గించినది. ఆమె కన్నులు తెరచి వెనుదిరిగిచూచెను. దొడ్డిగుమ్మముపద్ద నామె సోదరుడు- ఎవ్వరికొఱకు వేచివేచి, కనులు గాయలుగాచి, నిరాశాతప్తయై యాత్మహత్యకు పాల్పడెనో- యాసుదర్శనమూర్తి- యాందోళనాక్రాంతుఁడై నిలువఁబడిపోయెను. ఆభయంకర దృశ్యమును తిలకించునకి సుదర్శనమూర్తి యచేతనుఁడై కొయ్యబొమ్మవలె నిలువఁబడిపోయెను.

సరోజని వెనుదిరిగి చూచి చటాలున సుదర్శనమూర్తి కడకు బరువెత్తుకొనివచ్చి యాతని కౌగలించుకొనెను. ఆమె నేత్రములనుండి వెడలు యశ్రుధార లాతని దుస్తుల తడిపివేయఁ దొడంగెను.

"సరోజనీ! ఏలయిట్టి సాహసమునకుఁ బాల్పడితివి? నీకు జీవితముపై విరక్తి గలుఁగనేల? జనకుఁడేమయిన నిందించెనా? ఏల యాత్మహత్యఁ గావించుకొన యత్నించుచుంటివి?"

సరోజని మారు పలుకలేదు. ఆతనికి తనపై నాగ్రహము కలుగలేదని యామె గ్రహించెను. అయినను యామెకు సంపూర్ణముగ హృదయశాంతి కలుగలేదు. ఒకవేళ సుదర్శనమూర్తి తన యుత్తరములోని యంతరార్థమును గ్రహింపలేదేమో! తాను వెడలఁ బుచ్చిన నాతని హృదయము క్రోధఘూర్ణిత మగునేమోయని యామె శంకింపఁ దొడంగెను. ఆ భయముచేతనే యామె మాటాడలేకపోయెను.

"సరోజనీ! మారుపలుకవేమి? నాపై కోపమువచ్చినదా? నీ పుత్తరములో వ్రాసినట్లు వెంటనే రాలేదనియా? రమ్ము. లోనికిఁ బోవుదము."

అని పలుకుచు సుదర్శనమూర్తి యామెను సావడిలోనికి దోడ్కొనిపోయెను. అప్పటి కేడుగంటలైనది. మాధవరావింకను ఇల్లు చేరలేదు.

సరోజనీ సుదర్శమూర్తి లిరువురును లోవడిలో చేరియొక కుర్చీపై నాసీనులైరి.

" సరోజనీ! చెప్పు. నీవిచారకారణమును చెప్పు. నీక్షేమము కొఱకు, నీయభివృద్ధికొఱకు నేను జనకునితోఁగూడ కలహించి నీకు విద్య నేర్పించినసంగతి మఱచితివా? నీసౌఖ్యముకొఱకు నేను బంగాళా ఖాతములో నురుకుమన్న నురుకుటకు సిద్ధముగ నున్నాను. "

అమృతరస ప్రపూర్ణమగు నాతని పలుకు లామెకు హృదయము శాంతి నొసంగినవి. సావకాశముగఁ దన కాంక్ష నెఱిఁగింప వచ్చునని యామె తలంచి, " అన్నా! ఏమియును లేదు. నిన్ను చూడవలయు నను యూహతో వ్రాసితిని " అనెను.

సరోజని తన యభిప్రాయమును మఱుఁగుపఱచుచున్నట్లాతఁడు గ్రహించెను. నిలకడపై నెఱుంగవచ్చునని తలచి యాతఁ డప్పటి కూరకుండెను. ఇంతలో మాధవరావుకూడ వచ్చుటచే నప్పటికా సంభాషణ మాటంక పఱుపఁబడెను. తండ్రి కుమారు లిరువురును యించుక యొకరి యోగక్షేమము లొకరెఱిఁగినపిమ్మట నందరును యానాటికి భోజనముచేసి పరుండిరి.

---

# ఏడవ ప్రకరణము.



విశాఖపట్టణము చుట్టుపట్ల నంతయు పర్వత ప్రదేశము. అందుచే వేసవికాలములో వేడిమియు, శీతకాలములో చలియు నధికముగ నుండును. ఆ సమీపమునుండి విదేశములకుఁ బోవువరకు లన్నియు నా పట్టణమునుండియే పోవుచుండును. ప్రతిదినమున సముద్రతీరమున సరుకుల నెగుమతిదిగుమతులు మున్నగుపనులకు వచ్చిపోయెడు వర్తకసంఘము, కూలీలు మున్నగువారు వచ్చి పోవుచుందురు. మన కథాకాలమున కింతటి ప్రాముఖ్యతవహింపకపోయినను, పెద్దపెద్ద యోడలు చేరుట కనువగు హార్బరు లేకపోయినను మొత్తముమీద కొద్దియో గొప్పయో, సముద్రవ్యాపారము జరుచునే యుండెను.

విశాఖపట్టణమున కనతిదూరముననే యొక పెద్దభవనముగలదు. అందు రామలాలను యొక మారువాడీ నివశించుచుండెను. రామలాలు కోటీశ్వరుఁడు విదేశవ్యాపారస్థులందఱ కాతఁడు పెట్టుబడి పెట్టుచుండెడివాఁడు. ఆతనియెడ నాపట్టణమునఁగల ధనవంతులకందఱకును విశేషగౌరవము. ప్రతిదినము నాతనికడకు వర్తకులు వచ్చుచు పోవుచునుందురు. రామలాలెంత ధనవంతుఁడో యంత యుదారస్వభావుఁడు. స్వల్ప వడ్డీలపై నాతఁ డప్పుల నొసంగుచుంటచే నెల్లరును నాతని దేవుఁడని కొనియాడుచుండిరి.

ఒకానాఁడొక పురుషుఁ డూరువిడచి రామలాలు భవనము వైపు వడివడిగ నడచి పోవుచుండెను. అతఁడు సుమారు పాతిక వత్సరములవాఁడు. ధరించిన వసనంబులవలన నిరుపేదయని గ్రహింప

వచ్చెను. భవనమును సమీపించి లోన బ్రవేశింపఁబోవ నటనున్న జవానులు వాని నాటంకపఱచిరి. ఆపురుషుఁడట నిలువఁబడిపోయి, తన దురదృష్ట దినము లింకను యంతరింపక పోవుటచేతనే యుదార స్వభావుఁడగు రామలాలు దర్శనమున కంతరాయము సంభవించెనని యింకను నేమేమో గొణిగికొనుచు నిలువఁబడెను. బంట్రోతులచూచి, దయారస ముట్టిపడునట్లు, " బాబూ! నిరుపేదను. రాబోవుచున్నది వర్షాకాలము. కట్టుబట్టలుదక్క వేరు వస్త్రంబులులేవు. దయాస్వరూపుఁడగు ప్రభువువారిని దర్శించి యేమయిన నడగికొనవలయునని తలంచి వచ్చితిని. లోనికి పోనిండు " అని బ్రతిమాలసాగెను.

ఆ భిక్షుకుఁడు బ్రతిమాలుచున్నకొలది నాసేవకుల యార్భాటము హెచ్చగుచుండెను. వారికేకలు క్రమముగ మేడపై బసుండి పుస్తకమును చదువుకొనుచున్న రామలాలు చెవులంబడెను. వెంటనే రామలాలు మేడచివరకువచ్చి యచటనున్న యూచలగుండా వీధిద్వారముకడ జరుగుచున్న పోరాటమంతయు దిలకించుచుండెను. అసేవకులు చివరకాభిక్షుకునిఁ గొట్టుటకు కూడ ప్రయత్నించిరి. ఇంతవఱకు కార్యమంతయు మేడమీఁదనుండి తిలకించుచున్న రామలాలిక నూరకున్న నాబిచ్చగాఁడు నిష్కారణముగ నాసేవకులచే దండింపఁబడునని యూహించి యచ్చటనుండియే సేవకులను కేకవేసెను.

తమ యజమానుని కేకవినినంత నా సేవకులు వెనుదిరిగి చూచిరి. రామెన్నఁడునుగానిని సాహసకృత్యమున కధికారివలన మాటవచ్చునని వారు భయమందసాగిరి. రామలాలా భిక్షుకుని లోనికిరమ్మని సంజ్ఞచేసి తాను మేడమెట్లుదిగి క్రిందిసావడిలోనికి వచ్చెను—రామలాలు సావడిలోనికి వచ్చునరికే యా భిక్షుకుఁడు సావడిలో ప్రవేశించెను.

రామలాలు వచ్చినతోడనే యాబిచ్చగాఁ డాతనికి సగౌరముగ నమస్కరించెను. రామలా లాతని నఖశిఖ పర్యంతరము పరిశీలింపఁ

దొడంగెను. జీర్ణవసనధారి యయ్యును, నాతని యవయవముల పొందిక ముఖవర్చస్సు గాంచన నాతఁడుత్తమవంశ సంజాతుఁడై యుండుననుట కెంతమాత్రమును సందియముండదు. తనకుఁగల్గిన సందేహము నివారించుకొనుట కాతఁడా భిక్షుకునిగాంచి, "ఓయీ! నీదేయూరు? కులమేది?" యని ప్రశ్నించెను.

"బాబూ! పలువారికూళ్ళుగాని, ఎత్తుకొని తినువారి కొక యూరా? ఏపట్టణమున భిక్షము దొరకిన నచ్చటనేయుందును. ఇక కులము మాటయా? ఈదినములలో ధనమునుబట్టియే కులము వచ్చుచుండును."

ఆతని ప్రత్యుత్తరమువలన నాతఁ డుత్తమకులస్థుఁడేయని లాలు గ్రహించెను. కాని యాతఁడట్టి నీచస్థితికి వచ్చుటకుఁ గారణ ముండవలయునుగదా! లాలాలోచింపఁ దొడంగెను ఎట్టకేలకు తన సంశయము నిట్లు వెలిబుచ్చెను.

"ఓయీ! నీవైఖరిచూడ నుత్తమ వంశీయుఁడవనుట నిర్వివాదాంశము. శరీరమతి సుకుమారమైనదిగఁ గన్పట్టుచున్నది. దాన సుఖజీవివనిగూడ చెప్పవచ్చును. కాని నీకీ దురవస్థ యెందులకుఁ గల్గెనో బోధపడలేదు."

"స్వామీ! ప్రభువులకడ దాపరికమేల? అదియుంగాక తన తప్పు నొక తగుమనుష్యుని కడ వెల్లడించినచోఁ గొంత పాపశాంతి గలుఁగునని పెద్దలు చెప్పుదురు. నేను కులమున బ్రాహ్మణుఁడను మొదటినుండియు తలిదండ్రుల యాజ్ఞల బాటింపక నాయిచ్చ వచ్చి నట్లెల్ల ప్రవర్తించు చుండెడివాఁడను. కాని వారు జీవించియున్నంత కాలమును, నా కొకప్పైసయైన చేఁజిక్కక పోవుటచే నా దుష్ప్రవర్తనకుఁ గొంచె మంతరాయముగ నుండెడిది. కొంతకాలమునకు నాతండ్రి మరణించెను. నాతండ్రితోబాటు నాదరిద్రదేవత కూడ యంతరించి

నది. వారాణాసి కంతకును నేనే యధికారి నైతిని. దినవారమును ముగిసినవెంటనే నే నినుపపెట్టె తెరచి యందున్న ద్రవ్యమంతయు నేకరించుకొని యిలువిడిచితిని. చేత విత్త మున్నంత కాలము స్నేహితులకు లోపముండదు గదా! రెండు నెలలలో సుమా రైదువేలు వ్రయ పరచితిని. దగ్గరనున్న పైకము తగ్గిపోవుటచే నప్పుడు కండ్లు తెరచి చూచితిని. అప్పటికి నాయెద్ద నూటయేబది మాత్రమే గలవు. అంతటి నుండి మెల్లగ మిత్రుల నంటఱను వదలుకొని మఱిమూడు మాసములు గడపితిని. అప్పటికి నావద్దనున్న ధనమంతయు పూర్తియయ్యెను. ఉద్యోగమునకు ప్రయత్నించితిని. పట్టభద్రులకే యీకాలమున నుద్యోగములు దొరకనప్పుడు నాబోటి నిరక్షరుని కెవ్వ రుద్యోగ మిత్తురు? భుక్తి గడచుటకు వే రుపాయముం గానక కడకు భిక్షాటనకుం గడంగితిని. ఇదియే నా జీవయాత్ర. ”

భిక్షుకుం డీపల్కులు నుడువునపుడు రామలాలు ముఖమున దయారసము వెల్లడి కాం దొడంగినది. ఆతండింక కొంతసేపు దీర్ఘాలోచనానిమగ్నుండై యట్లే కూర్చుండి పోయెను. కొంతసేపటికి లేచి భిక్షువు నటనే యుండ నియమించి, తాను లోని కరిగెను.

ఆ భిక్షుగాండాగదియంతయు పరిశీలింప సాంగెను. గోడలకు హిందూవీరుల చిత్రఫలకములు వ్రేలాడుచుండెను. ఆదృశ్యమా భిక్షునకేలనో యాశ్చర్యము గలిగించినది. నావశిగో క్రిందనొక కంబళము పరువంబడి యున్నది. నాల్గు కుర్చీలు, రెండు బెంచీలు మాత్రమే యందు గలవు. అంతకన్న నెక్కుడు దృశ్యము లేమియు నా భిక్షునకట గోచరించలేదు.

పావుగంటలో రామలాలొక పంచెలచాపు నాల్గురూపాయిలు తెచ్చి యా భిక్షున కొసంగెను. “ ఓయీ! వారము దినముల పిదప నాగాన్పించిన నీకు దగిన జీవనోపాధి చూపించుటకు యత్నించెద” ననెను.

ఆ పలుకు లాభికుని కన్పుకపానము కంటె నెక్కుడు సంతోషదాయకముగ గాన్పించెను. వినయపూర్వకముగ నాతఁడు రామలాలున కభివందనము లాచరించి వెడలిపోయెను. రామలాలు ద్వారము కడ నిలువఁబడి యాభిక్షుకుఁడు కంటికి కనఁబడు నంతవఱకు దిలకించుచునే యుండెను. భిక్షుకుఁ డదృశ్యుఁ డయినవెంటనే రామలాలు తిరిగి మేడ మీఁదికి వెడలిపోయెను.

పాఠకులారా! మనమొకసారి రామలాలు గృహమంతయు పరీక్షింతము. మేడ క్రిందిభాగమున మనము చూచిన చావడిగాక లోపల నాలుగుగదులు మాత్రమే యున్నవి. అందొకగది సేవకులు నివసించుటకు యొకటి సామానులే చెప్పుచున్నవి. ఒకగదిలోనుండి మేడమీఁదకు మెట్లు గలవు. మిగిలిన రెండు గదులలో నేమియు సామానులు లేవు. మేడమీఁదకు బోయి చూతము. పైన గూడ నాల్గుగదులు మధ్య చావడి గలదు. ఒకగది వంటగది. ఒకటి రామలాలు శయనాగారము. మిగిలిన రెండు గదులలోను గృహోపకరణీయములకు సామగ్రులు గలవు, రామలా లొంటరిగాడు. ఆతని కెవ్వరును యాత్రీయులు గాన్పింపరు. ఇరువురు సేవకులు, వంటవాఁడు, రామలాలు దక్క నాగృహమున నైదవ మానవుఁడు గాన్పింపఁడు. లాలు శయనాగారమున గూడ హిందూవీరుల పటములే వ్రేలాడుచుండెను. ఎక్కడను ముచ్చటకైన నొక భగవంతుని పటము గాని తదితర శృంగార చిత్రవులు గాని గోచరింపవు- వీనింబట్టి చూడ రామలాలు వీరపురుషుఁడని తెల్లమగుచున్నది. ఆతనికి దైవభక్తి యనుమాతయు నున్నట్లు తోచదు. అట్లే యైనచో నాతఁడు భవనమున కనీస మొక దేవతావిగ్రహముగాని, పటము గాని యుంచుకొని యుండును.

రామలా లచ్చట ప్రవేశించి రెండువత్సరములు గడచినవి ఆరెండు సంవత్సరముల నుండియు నాతని తాలూకు చుట్టములుగాని

ఇతర స్నేహితులు గాని యెన్నడును గాన్పించినట్లు లేదు. ద్రవ్యము కొఱకు వర్తకులు మాత్రము వచ్చుచుండిరి. ఇదియే మనకుఁ దెలిసినంత వఱకు రామలాలు జీవిత చరిత్రము.

---

# ఎనిమిదవప్రకరణము.



సాయంకాలము, చల్లగాలికి యుద్యోగులు, విద్యార్థులు సముద్రతీరమునకు షికారుగ పోవుచుండిరి. వివిధవేషములు ధరించి పోవుచున్నయావ్యక్తుల గాంచిన చాల నేత్రానందకరముగ నున్నది. కొందరు కారుల మీదను, కొందరు సైకిళ్ళ మీదను, మరికొందరు బండ్ల మీదను, యింక కొందరు కాలి నడకను పోవుచుండిరి. ఆసమయమున నిరువురు పురుషులొక కారులో కూర్చుండి ఏమేమియో ముచ్చటించుకొనుచు పోవుచుండిరి. మనము కూడ వారి సంభాషణ మాలించి యంశ మేమయిన బోధ పడునేమో చూతము.

ఒక్కడు:—అబ్బా! అంత సౌందర్యవతియా?

రెండవవాడు:—సౌందర్యమున నామెను మించిన యువతి లేదని చెప్పవచ్చును. మనయూర చూడలేను. మరెచ్చటను గూడ చూడమనియే నానమ్మకము.

ఒక్కడు:—ఇన్ని దినములనుండి యొక్కమారయిన చెప్ప లేదేమి?

రెండ:—ఏదీ? అవకాశము గలుగలేదు. నేనామెను చూచిన నాటి సాయంకాలమే యీపట్టణమును వీడచితిని. తిరుగ నిన్ననేకదా వచ్చితిని?

ఒక్కడు;— ఆమె తండ్రి చాల పూర్వాచారపరాయణుడు గదా! నీవామె నెట్లు చూడ గల్గితివి?

రెండ:—కొండొక కారణముపై నేను వారియింటికి వెళ్లుట తటస్థించినది. అప్పుడు చూచితిని.

వారిట్లు మాట్లాడుకొనుచు పోవుచుండిరి. వారి వెనుకనే యొక యువకుఁడు పాశ్చాత్య వేషమును ధరించి మోటారుసైకిలుపై బోవుచుండెను. అతఁ డేదియో యగత్య కార్యముపై పోవుచున్నాఁడని యాతని మోటారుసైకిలుయొక్క గమనవేగమే వెల్లడించుచున్నది. కారులను బండ్లను చాలవాటిని తప్పించుకొని యాతఁడు తుదకు మనము మొదట చూచిన మోటారును సమీపించెను. తనసైకిలు మోటారు ప్రక్కనుండి పోనిచ్చుచు కారులోనికి చూచెను. అతఁ డేలనో తన సైకిలు గమనవేగ మించుక తగ్గించెను. కారులోని మనుజు లాదృశ్యము చూడనేలేదు. కాని సైకిలుమీది వ్యక్తిమాత్రము వారు తన్ను చూచియుండరేమోయని యనుమానించెను. మెల్లగ వారికారు వెంబడినే పోవుచుండెను.

కారులోని మనుజులు మరల నిట్లు మాటలాడుకొనజొచ్చిరి.

ఒకడు:—అయితే నా కెల్లాగునయినా ఆమెను చూపించ గలవా?

రెండవ:—చూపించడ మేమిటి? కావలసినచో మాయచేసి నీ యధీన మొనర్చెదను.

ఒక:—సాధ్యపడునా?

రెండ:—సాధ్యపడుట కొక యుపాయమున్నది.

ఒక:—ఏమది?

రెండ:—దానిని వెల్లడింపరాదు. అట్లుచేయుట నా కుత్తుకపైకి కత్తి నేనే స్వయముగ దెచ్చుకొనుట

మొద:—పనే పోనిమ్ము. ఒకసారి చూచిపోదుము అంతియు చాలును.

రెం:—రేపు సాయంకాలము ఆ యువతిని వెంటబెట్టుకొని నేను బీచికి వచ్చెదను. నీవుకూడ రమ్ము. ఇక్కడ నామెతో సంభాషింపవచ్చును.

అంతటితో వారిసంభాషణ ముగిసెను. వెనుక మోటారు సైకిలు మీద వచ్చుచున్న వ్యక్తి యాసంభాషణోత్తరభాగము మాత్రమే వినఁగలిగెను. అందుచే నంతలి యర్థము పూర్తిగా బోధపడకపోయినను మొత్తముమీద వారొక యువతిని మోసగింప నెంచి యుండిరని యాతఁడు నిశ్చయించుకొనెను. ఆయువతి యెవ్వరు? ఏమో ఎట్లు తెలియును. పరోపకారపారీణుల కందఱును సమానులే.

ఇంతలో వారు సముద్రతీరము చేరిరి. ముందు పోవుచున్న వ్యక్తు లిరువురును కారునుండి దిగి యచ్చటగల యొక తిన్నెపై గూర్చుండిరి. సైకిలుమీఁద వచ్చిన యువకుఁడుగూడ వారి కనతిదూరములోనే సైకిలుదిగి వేరొకతిన్నెపై గూర్చుండి ప్రకృతిరమణీయమును తిలకించుచుండెను—

---

## తొమ్మిదవ ప్రకరణము.



"శ్రీనివాసరావూ! చూచితివా యా మహమ్మదీయుని దురాగతము!"

"చూచితినిగాని వారికంత కండ్లగుట్టింపఁగలిగిన యువతి యెవ్వరోగదా!"

" సాయంకాలము తెలియుంగదా!

" అయిన నామె రక్షణమునకు మనము పోలీసుల సహాయము గైకొనవలయునా? "

" వలదు. పోలీసు లనవసరము. నా మిత్రుఁ డొకఁ డున్నాడు. రాత్రి వానితో నీసంగతు లన్నియు దెల్పితిని. మూఁడు గంటలకే యిచ్చటకు వచ్చి మనల గలసికొందునని చెప్పెను. "

" నన్నుగూడ మీతో తీసుకొనిపోయెదరా! "

" అవశ్యము నావచ్చును. ఒకరికొకరు తోడుగదా. "

" గొడుమాట యెట్లున్నను. యీ నిర్భాగ్యయువతి యెవ్వరో యని నా కనుమానముగ నున్నది. "

గడియారము తొమ్మిది గంటలు కొట్టినవి. శ్రీనివాసరావు కుర్చీలోనుండి లేచి చావడిలోనుండి వంటగదిలోనికిఁ బోవు గుమ్మమువద్దకు వెళ్ళెను. " కమలా! కాఫీ యింకను కాలేదా? " అను కేకవేయునంతలోనే కమల రెండు వెండిగ్లాసులలో కాఫీ తీసికొని యచ్చటికి వచ్చెను. శ్రీనివాసరావు వెనుదిరిగి మరల వచ్చి తన కుర్చీలో కూర్చుండెను. కమల తెచ్చియిచ్చిన రెండుగ్లాసులను చెరియొకటియును గైకొని త్రాగుచుండిరి కమల యచ్చటనే నిలువఁబడెను. ఇంతలో వీధితలుపు తెరచుకొని సరోజిని వచ్చెను. ఆమెను చూచినంతనే కమల యెదురేగి, " సరోజినీ! వచ్చితివా? రమ్ము లోనికిబోయి కాఫీ తీసుకుందాము. " అని పలుకుచు సరోజిని చేయిపట్టుకొని లోనికి గొనిపోయెను.

సరోజిని మనము శంకాకులమయ్యెను. తా నెప్పుడువచ్చినను శ్రీనివాస మోహనరావు లిరువురునుఁగూడ తన్ను పలుకరించెడివారు. నాఁడు వా రిరువురునుఁగూడ మాటలాడ కూరకుండుటయు, తాను లోన బ్రవేశించుసరికి కమలా శ్రీనివాసమోహనులు ముగ్గురొక్క-

చోటనే యుండుటయు, తా నెక్కడ నిలువబడుటకైన నవకాశము గనబరుపకుండ కమల తన్ను వెంటనే లోనికిఁ దీసికొనిపోవుటయు మున్నగువిషయము లన్నియు నామె హృదయమునఁ జేరి చూమెను గలంపసాఁగెను. వారు ముగ్గురును తన్నుగురించియే సంభాషించుకొను చుండిరని యామె కనుమాన ముదయించెను. ఆహా? కాలమహిమ యిట్లేగదా పరిణమించుచుండును!

సరోజనిమాత్రము తన హృదయమున నెంత భాధపడుచున్నను తన బాధ నిసుమంతయు వెలిబుచ్చలేదు. సరిగదా! వారు తెలిసికొనుట కవకాశమైన నొసంగలేదు. కమలతో తానుగూడ యిష్టములే కున్నను యించుక కాఫీ తీసుకొనెను.

"కమలా! ఇంటికివెళ్ళి మరల వచ్చెదను."

"ఏమంతతొందర? కొంచ మాగి పోఁగూడదా?"

"అట్లుకాదు. మీ రేదియో మాటలాడుకొనుచున్నారు. నాయునికి మీ సంభాషణమున కాటంకము గల్గించునేమో."

"మే మేమియు మాటలాడుకొనుటలేదు. అయినను నీకడ గూడ మీ యన్నగారికి రహస్యము లుండునా?"

సరోజని కా పలుకులు తృప్తికరముగ లేవు ఆమె యట నుండుటకుఁగూడ మన మంగీకరించుటలేదు. తన ప్రేమసంబంధమైన ప్రసంగములే వారు జరుపుచుండిరని యామె యూహించెను. చటాలున లేచి యామె చావడిలోనికి వచ్చెను. మోహనరా వొక్కఁడే యచట కూర్చుండియుండెను. అతఁడు సరోజనిని చూచి చిరునగవుతో "సరోజనీ! యచటనే నిలువఁబడితివేమి? రమ్ము కూర్చుండుము." అనెను.

"క్షమించుడు. అవకాశము లేదు."

ఎన్నఁడును తన మాట కెదురాడని సరోజని నాఁడట్లు ప్రత్యుత్తర మొసంగుట మోహనరావున కాశ్చర్యము గల్గించినది. సరోజని తన హృదయాలోచనలను గప్పిపుచ్చవలయునని తలంచియు కృతార్థకాఁజాలకపోయెను. మోహనరా వామె యేదియో నిగూఢముగ తన హృదయమున భద్రపఱచుకొనినదని గ్రహింపఁగలిగెను.

"సరోజనీ! ఒక్కమాట విని పొమ్ము.

"ఏమది?"

"నీ హృదయమున నేవియో యాలోచనలు కలంచుచున్నవని తలంచుచున్నాను. అవేవియో యెరిఁగించెదవా?"

"నా హృదయభారము చెప్పుటచే నివారణ గాఁజాలదు. యెన్నటికైన మీకతమునననే నా బాధ నివారణగావలసియున్నది." అని పలుకుచు నామె దివ్యాన వీధితలుపు తెరచికొని వెడలిపోయెను.

మోహనరావు మరింత యాలోచనామగ్నమానసుడయ్యెను. "సరోజని బాధ నావలన నివారణ గావలయునా? ఈ పలుకుల యర్థమేమి? ఆమెకు గలిగినబాధ యెట్టిది?" ఆతని కేమియు బోధపడలేదు. అట్లే యాలోచనామగ్నమానసుఁడై కూర్చుండిపోయెను.

---

# పదియువ ప్రకరణము.



శ్రీనివాసరావు గృహమునుండి బయలుదేరి సరోజని సరాసరి తన యింటికి పోవుచుండెను పదియడుగులువైచుసరికట తనయన్నయు శ్రీనివాసరావును యేమేమియో ముచ్చటించుకొనుచుండిరి శ్రీనివాసరా వామెను చూచి, "సరోజనీ! అప్పుడే వెడలిపోవుచుంటివేమి?" యనెను.

సరోజని మారుపలుకలేదు ఒకపరిమాత్రము శ్రీనివాసరావు వైపు దృష్టిని సారించెను. ఆమె నేత్రములయం దేదియో మహత్తర కాంతి ప్రకాశించుచుండెను. సుదర్శనమూర్తి యందలి భావమును గ్రహించెను కాని యూరకుండెను.

శ్రీనివాసరావు, సుదర్శనమూర్తు లిరువురు నించుక సంభాషించినపిదప నెవరి యింటికి వారు పోయిరి.

సుదర్శనమూర్తి యింటికరుగుసరికి సరోజని తనశయనాగారమున నుండెను. ఆమె నేత్రముల వెంట నశ్రుకణంబులు జలజల రాలుచుండెను పర్యంకము కొంతవరకు తడసిపోయినది

సుదర్శనమూర్తి యామెకొఱకు యిల్లంతయు వెదకి చివరకామె పడకగదిలోనికిబోయెను. అధోముఖియై పరుండి యామె దుఃఖించుచుండెను. ఆమెను తిలకించినంతనే సుదర్శనమూర్తి యొడలు ఝల్లుమనెను. తానింతవర కెన్నడును సరోజని యేడ్చుట చూచియుండలేను. ఆమె కన్నీరు హాలాహలముభాతి నాతని హృదయమును దహించుచుండెను. చటాలున సరోజనిని సమీపించి, “ సరోజనీ! సరోజనీ! ఏ యిట్లు వాపోవుచున్నావు? లెమ్ము. ఇటుచూడుము. నిన్నెవరైన నేమయిన ననిరా? ” యని పలుమారులు ప్రశ్నింపసాగెను. ఆతడట్లు ప్రశ్నించుచున్నప్పు డాతని కంఠము రుద్ధమైపోయెను.

సుదర్శనమూర్తి ప్రశ్నించుచున్న కొలది సరోజని దుఃఖమతిశయింప సాగినది. తుద కాతడామెను లేవదీసి కూర్చుండబెట్టి తన భుజముపైనున్న తువ్వాలుతో నామె కన్నీరొత్తెను. కొంతసేపటికామె దుఃఖ మించుక యుపశమించినది.

“ సరోజనీ! నీవిచారముచూడ నాకు చాల భయమగుచున్నది నీయిచ్ఛప్రకారము గావింతునని శపథము చేయుచున్నను నీకు నా పలుకులయందు విశ్వాసములేదా?

సరోజని మాటాడలేదు.

" చెప్పు. నీహృదయాభిప్రాయము చెప్పు. ఊరక విచారించిన లాభము లేదు. "

సరోజని తలయెత్తి యన్నవైపు చూచెను. ఆనేత్రములనుండి విరహావేదన ధారాళముగ బయల్వెడలుచున్నది. సుదర్శనమూర్తి విద్యావంతుడు. చాల దేశములుతిరిగి విశేషానుభవము సంపాదించెను.

" చెల్లీ! నీకింకను చదువుకొనవలయునని యున్నదా? "

సరోజని యనంగీకార సూచకముగ తల నాడించెను.

" ఏదయిన నుద్యోగమునకు బ్రయత్నింపు మందువా? "

" వలదు. "

" అయిన నీయభిప్రాయ మేమో యెరింగింపుము. "

సరోజని తనకోర్కె వెలిబుచ్చవలయునని తలంచెను. కాని సాహసింపలేకపోయెను. సరోజనియే గాదు- యౌవనమున నలరారుచున్న యేయువతియైన తనకుంగల వివాహాభిలాష తనంతతానే నెరింగింపగలదా? అందున సరోజని పూర్వపువాసిని. అట్టిచో నామె యట్టి యభిప్రాయము నెరింగించుట యనిన సామాన్యకృత్యమా! సరోజని యేమియు మాటాడలేదు.

" సరోజనీ! దాచకుండ నాప్రశ్న కుత్తర మొసంగుము. చూడబోవ నీహృదయ మన్యాక్రాంత మయినట్లు తోచుచున్నది. యథార్థ మెరింగింపుము. "

సరోజని సిగ్గుపడిపోయెను. సుదర్శనమూర్తి యయ్యదిగూడ గ్రహించెను. ఆమె వలపుజెందినదని గ్రహించెనుకాని యామెహృదయమును కలంచిన పురుషుం డెవ్వరై యుండునా యను సందేహ మాతని బాధింపజొచ్చెను. సరోజని స్వయముగ తన కావిషయ మెరిగించునను యాశ యాతనికి లేదు. శ్రీనివాసరావున కేమయిన దెలిపియుండు

నేమో తెలిసికొనవలయునని యాతఁ డాలోచించెను. ముందు సరోజ నికి హృదయశాంతి గలిగించు టాతని విధియై యున్నది. అందుచే నాతఁడు మెల్లగ సరోజనిని బుజ్జగించుచు, "చెల్లీ! నీ వెంతమాత్ర మును మనోవ్యాకులత నందకుము. నీ మనోభీష్టము నే నెరింగితిని. త్వరలో నీకోర్కె తీర్చెదను." అని పలికి గూతఁడు చటాలున నిలు విడచి శ్రీనివాసరావు గృహమునకు వచ్చెను.

శ్రీనివాసరావు భోజనముచేయుచుండుటచే సుదర్శనమూర్తిని పిలుపునకు భర్త యనుమతిపై కమల తలుపుతీసి, "భోజనముచేయు చున్నారు. సావడిలో కూర్చుండమన్నారు." అని పలికి లోనికి వెడలి పోయెను. సుదర్శనమూర్తి యింతవర కెన్నఁడును కమలను చూచి యుండలేదు. కమలకూడ యాతని నెరుంగదు.

నాఁడు పదిగంటలకే మోహనరా వేదియో పనియున్నదనియు, తాను తిరిగివచ్చునది కొంటెగంట యగుననియు చెప్పి వెడలిపోయెను. అందుచే శ్రీనివాసరా వొంటరిగ భుజించుచుండెను. భోజనసమయమున సుదర్శనమూర్తి రాకముందు దా భార్యాభర్తలు సరోజనీమోహనరావుల ప్రేమానుబంధమునుగూర్చి ముచ్చటించుకొనుచుండిరి. సుదర్శనమూర్తి రాక వారి సంభాషణ కంతరాయము గల్పించినది. శ్రీనివాసరావు భోజనమును త్వరలో ముగించుకొని యీవలకువచ్చి తనకొఱకు సావడి లో వేచియున్న సుదర్శనమూర్తిని గలసికొనెను.

"సుదర్శనం! ఏదియో తొందరపనిమీద వచ్చినట్లున్నావు."

"అవును. అగత్యమగుపనియే. రహస్యముకూడను."

"అయిన గదిలో కూర్చుండము రమ్ము." అని పలికి తాను గదిలోని కరిగెను. సుదర్శనమూర్తికూడ లేచి యాతనివెంబడి లోనికి బోయి, యాతఁడు చూపిన యాసనముపైఁ గూర్చుండెను.

"ఈమధ్య వారముదినములనుండి మాచెల్లెలు సరోజని ప్రవర్తనయందు కొంచెము మార్పు కానబడుచున్నది. ఆమె తరచు మీ యింటికి వచ్చుచుండుట కలదు. అందుచే మీ కేమయిన నందలి రహస్యము తెలియునేమోయని వచ్చితిని."

ఆ మాటలు శ్రీనివాసరావున కాశ్చర్యము కలిగించినవి. ఏక గర్భసంజాతులగు సరోజనీసుదర్శనమూర్తులమధ్యగల రహస్య మితరులకు నెట్లు తెలియగలదు?

"సుదర్శనమూర్తీ! నీ ప్రశ్న చాల చిత్రముగ నున్నది. నీకు తెలియని రహస్యము నాకెట్లు తెలియును?"

"ఇందాశ్చర్య మేమున్నది? మేమేక గర్భజనితులమైనను నాకంటె నీవద్ద సరోజని కెక్కువ పరిచయముగదా. అందుచేత నీతో చెప్పవచ్చునుగదాయని తలంచితిని."

"నాతో నేమియు దెలుపలేదు"

"సరే! వీలుగ నున్న నామె యభిప్రాయ మెరింగి నాకు దెలుపెదవా?"

"అటులనే ప్రయత్నించెద."

సుదర్శనమూర్తి లేచెను. శ్రీనివాసరా వాతని సాగనంపి తన గదిలో పరుండి దీర్ఘముగ నాలోచింపసాగెను. సుదర్శనమూర్తి వచ్చి నేడిట్లు ప్రశ్నించుటకు గారణమేమి? 'జముగ సరోజనియందు మార్పు గలిగెనా? మున్నగు యాలోచనా తరంగము లాతని హృదయమున నుత్పన్నములయ్యెను. ఒకవేళ మార్పుగలిగినను నయ్యది యేవిషయమున గలిగియుండును? కమల కేమయిన తెలియునేమో యెఱింగెదగాక యని తలపోసి యాతడు ద్వారమువైపు చూచెను. కమలను కేకవేయ వలయునని తలంచునంతలోనే యామె మరచెంబుతో మంచినీటిని పట్టుకొని గదిలో ప్రవేశించెను. శ్రీనివాసరావు కమలను చూచి

నంతనే మంచముమీఁదలేచి కూర్చుండి. " కమలా! నిన్ను పిలువవలె ననుకొనునంతలో నీవే వచ్చితివి. సరోజిని యామధ్య నీతో నేమయిన జెప్పినదా? " అనెను.

" ఎవరివిషయమున? "

" ఆమె స్వవిషయమున. "

" నాకేమియుఁ జెప్పలేదు. "

" పోనీ! ఆమెలో నేమయిన మార్పు గావవచ్చుచున్నదా? "

" మార్పన కేమిలెండు. అనుదినమును ప్రతివ్యక్తికిని మార్పు గలుగుచునే యుండును. దానికేమిగాని సరోజని కిప్పటిలో వివాహము చేయరా? "

" తెలిసినది. అదియే యామెయందలి మార్పు. ఇంతవర కామెకు వివాహేచ్ఛ జనింపలేదు. అందుచే నామె జనకుడుగాని, సోదరులుగాని తద్విషయమున యత్నింపలేదు. ఇప్పుడిప్పు డామెకు వివాహము చేసికొనవలయునని కోరిక జనించినది గాబోలు. "

" అవును. మోహనరావును చూచినప్పటినుండియు నామె మనసు మారిపోయినదని నేననుకొనుచున్నాను. "

"కావచ్చును కాని మోహనరా వామెను పెండ్లాడుట కంగీక రించునో లేదో? "

" ఎందుచేత? "

" ఆమె వితంతువు "

కమల యాశ్చర్యమందెను. ఆమె వితంతువని కమల కింతవఱ కును తెలియనే తెలియదు. ఇంకను యవివాహితయని మాత్రమే తలంచుచుండెను. " అటులనా? అయినచో చాలకష్టమే " యనెను.

" సరే! ఎటులయిన నాయిరువురకు వివాహ మొనర్ప మనము గూడ ప్రయత్నింతము " అని పలుకుచు శ్రీనివాసరావు పరుండెను. కమల యాగదివీడి పోయెను.

# పదునొకండవ ప్రకరణము.



నాటి దినమున మధ్యాహ్నము రెండుగంటలకు సరోజని కాఫీ త్రాగి తనగదిలో కూర్చుండి, యాంగ్లభాషా పితామహులగు షేక్స్ ఫియర్ వ్రాసిన మర్చెంట్ ఆఫ్ వెన్నిసు (Merchant of Vennice) అను పుస్తకమును చదువుచుండెను. ఆమె చదువుకొనుచున్న దినములలోనే యాపుస్తకమును పూర్తిగా పఠించివైచెను. ప్రస్తుతము తన హృదయగత విచారమును పోగొట్టుకొనుటకేదియో యొక పని కల్పించుకొనవలయునని తలంచి యామె యాపుస్తకమును చదువుచుండెను. ఆపుస్తకము చదువుచున్నను యామెకు మోహనరావును గురించిన యాలోచన అంతరించలేదు. కొంతవరకు చదివి పిదప నామె యాపుస్తకమును మూసివేసి బల్లపై బడవైచెను. తన యభిలాష దీరు కాల మెప్పు డాసన్నమగునాయని యామె యాలోచింప దొడగెను. ఏమయినను సరియే నాటిసాయంకాలమే యామె తన కోర్కె సుదర్శనమూర్తి కెరింగింపవలయునని నిశ్చయించుకొనెను. ఆమె కేమియు దోచక నిటు నటు లా గదియందే పచారుచేయ దొడంగెను. కాలము జరిగిపోవుచుండెను. గడియారము మూడుగంటలు కొట్టినది. ఆలోచనాపరవశయైన యామె కా గంటలు వినబడనేలేదు. మూడుగంటలు దాటినపిదప నెవ్వడో యొక వృద్ధుడు వీధిగుమ్మముకడ చేరి, "సరోజనీదేవిగారూ!" అని పిలచెను. ఆ పిలుపు విని సరోజని యదరిపడెను. చటాలున పోయి తలుపు తెరచెను. ఎదుటనున్న వృద్ధునిం గాంచి యామె యాశ్చర్యమందెను.

ఆవృద్ధుఁ డామెను గాంచి, "సరోజనిదేవిగారు మీరేనా?" యని ప్రశ్నించెను.

"అవును. నేనే. ఎందులకు?

ఆ వృద్ధుఁ డామె కొకయుత్తర మొసఁగెను. ఆమె యాయుత్తర మందుకొని మడతలు విప్పెను. అది యాంగ్లభాషలో వ్రాయబడియుండెను. ఆత్రముతో నామె దానిని చదివెను. అందలి ప్రత్యక్షరమును యామె ముఖమునకు నూతనవికాసము గలిగింపసాఁగెను. లేఖ ముగించి యామె వీధిలోనికి చూచెను. వీధిలో నొక గుఱ్ఱపుబండి సిద్ధముగ నున్నది. సరోజని వెంటనే నూతని నట నుండుమని చెప్పి లోనికి పోయెను. పావుగంటలో నామె దుస్తులను మార్చివైచి, తల నున్నగ దువ్వుకొని, యలంకృతయై వచ్చి యామె గాకకై నిరీక్షించుచున్న యా వృద్ధునితో బండినెక్కెను. బండి శరవేగమునఁ బోవుచుండెను.

ఆహా! కాలమహిమ! మోహము మంచిచెడుగుల విమర్శింపనీయదుగదా! మోహనరావు పేరుతో నుత్తరము వచ్చినంతమాత్రముననే నయ్యది యదార్థమని భావించి యా వృద్ధునివెంట బోవుట కనుమతించిన యామె యవివేక మేమనవచ్చును. బండి తిన్నగ సముద్ర తీరమును చేరెను.

సముద్రతీరమున వర్తకులు మున్నగువారు మధ్యాహ్నకాలమున విశ్రమించుట కనువగున ట్లొక బంగాళా కట్టబడియుండెను. సరోజని ప్రయాణము చేయుచున్న బండి యందున్న వృద్ధునియాజ్ఞపై నా బంగాళావద్ద నాపఁబడెను. వృద్ధుఁడు బండిదిగి సరోజనినిగూడ దిగుమనెను. సరోజని బండి దిగినవెంటనే యా ముసలివాఁడు బండివాని కద్దె నొసంగి పంపివైచెను. తరువాత సరోజనిని వెంటబెట్టుకొని యాతఁడా బంగాళాలో ప్రవేశించెను.

ఆబంగళా చాల విశాలమైనది. అందు షుమారు ముప్పది గదులవరకుండును. అన్నిగదులును పరిశుభ్రముగ నుంచబడెను. ప్రతి గదియందును నాలుగేసి కుర్చీలు నొక తివాసీ యమర్పబడి యుండెను. సావడిలో నాబంగళా యధికారికి సంబంధించిన యుద్యోగి యొకడు కుర్చీలో కూర్చుండెను. ఆతనిముందొక బల్లపై కొన్ని పుస్తకములు గలవు. అవన్నియు నాబంగళాకు సంబంధించినవి. ఆసత్రమున బసచేయువారు మూడుగంటలకన్న నెక్కుడుకాల మున్నచో దినమున కెనిమిదణాల వంతున నద్దె నొసంగవలయును. ప్రభుత్వ సంబంధీకుల కానద్దె యవసరములేదు. ఆయధికారి కూర్చున్న కుర్చీ కెదురుగానే గోడకు గడియారము వ్రేలాడుచున్నది.

వృద్ధుడా యధికారిని సమీపించి, "అయ్యా! మాకొక గది కావలయును." అనెను. వెంటనే యాయధికారి యొక పుస్తకమును తీసి అందా వృద్ధునిపేరు వ్రాసికొనెను. ఆతనిచే నాపుస్తకమున సంతకము చేయించుకొని "24 వ గదిలో నుండుడు." అనెను. ఆపుస్తకమున ప్రవేశకాలముగూడ వ్రాయవలసి యుండుటచే నాయధికారి గడియారమువైపు చూచెను. నాలుగుగంటల నలువది నిముసములయ్యెను. ఆకాలమునుగూడ నా పుస్తకమున వ్రాసి సరిగానున్నదో లేదో చూచుకొనుమని పలుకుచు నా పుస్తకమునందలి కాలమును యా వృద్ధునికి చూపెను. ఆతడును సరిగా నున్నదని సూచించుచు తల నూపి సరోజనిని వెంటబెట్టుకొని నెం 24 రు గదిలో ప్రవేశించెను. ఆ క్షణముననే యొక సేవకుం డరుదెంచి యా ముసలివానికి నమస్కరించి, "స్వామీ! తమ కేమయినం గావలయునా?" యని యడిగెను. అందులకా వృద్ధుం డేమియు జవాబొసంగక సరోజనివైపు తిరిగెను. ఆమె తన కేమియు వలదని చెప్పి యూరకుండెను. సేవకుండు మరల

నమస్కరించి, " బాబూ! సావడిలోనే యుండెదను. అవసర మయి నచో పిలువుడు, అని పల్కుచు నాతడు వెడలిపోయెను.

సరోజని మోహనరావు రాకకై నిరీక్షించు చుండెను గడియార మైదుగంటలు కొట్టినది. అవృద్ధుడు యెవ్వరికొఱకో నిరీక్షించుచు సావడి గుమ్మమువద్ద నిలువబడి యుండెను.

సరో:—ఓయీ! అయిదుగంటలు దాటిపోయినది. ఇంకనూ రాలేదేమి?

వృద్ధు:—ఏమోనమ్మా! ఎట్లు చెప్పగలను?

సరో:—నిజముగ వచ్చునా?

వృద్ధు:—సరిసరి యెంతమాట! నాతో తానక్కడకు అయిదు గంటలు లోపుననే వచ్చెదనని చెప్పెను. ఇంకొక అరగంటచూచి రాకున్న మనమింటికి వెడలిపోవుదము.

వృద్ధుడు వీధిద్వారమువైపు చూచెను. ఆసమయముననే యిరు పురువ్యక్తు లాబంగాళాలో ప్రవేశించుచుండిరి. వారిని గాంచినంతనే యావృద్ధుని కమితానందము కలిగెను. చరచర నడచి వారిని గలసి కొనెను. అందొకడు వృద్ధునితిలకించి, " తీసుకవచ్చితి ...? " యనెను. వృద్ధుడు 'ఊ' యనెను. వెంటనే యావ్యక్తి తనజేబులోనుండి అయిదు రూపాయిల కాగితము నొకదానినితీసి యావృద్ధున కొసంగి, " ఎక్కడ నున్నది? " యనెను.

" నెం 24 రు గది. "

" సరే మేము తిరిగి వచ్చువరకు నీవు బీచికడనుండుము. "

వృద్ధుడు నమస్కరించి వెడలిపోయెను. ఆవ్యక్తు లిరువురును బయలుదేరి నెం 24 రు గదివద్దకు వచ్చిరి. మెల్లగ లోన ప్రవేశించి చెరియొక కుర్చీపై గూర్చుండిరి- ఆనూతన పురుషులగాంచి సరోజని నివ్వెఱపడెను. ఛటాలునలేచి యావలకు పోబోయెను. అంత నా వ్యక్తు

లలో నొక డామెను గాంచి, "సరోజనీ! వెడలిపోయెదవేల? నీతో ముచ్చటింప వలయునను ముచ్చటతో వచ్చియుంటిని. కూరుచుండుము." అనెను. ఆమె మరింత దద్దరిల్లసాగెను. తానాలోచనా విహీనయై మోసపోయితినని యామె తెలిసికొనెను. ఆతరుణంబున సాహసచతురుల వారిని మెప్పించి వారి బారినుండి తప్పించుకొన వలయునేగాని వేరుమార్గ మామెకు గోచరింపలేదు.

"అయ్యా! మీరెవరు? నాతో నేమిపనియున్నది?"

"నిలువబడియే మాటలాడుచుంటివి. కూర్చుండుము మావలన నీకేమియు హాని కలుగనేరదని నమ్ముము."

సరోజని యట్లే నిలువబడిపోయెను. కూర్చుండుటకామె మన మంగీకరింపలేదు. వారల దిలకించిన నామెకేలనో భయము కలుగ జొచ్చెను. ఆమె చటాలున సావడిలో ప్రవేశించెను. బంగళా యధికారి యుండు చోటుకు వచ్చెను. అక్కడాతడు లేడు. వీధిద్వారముకడ తన్నచ్చటకు తోడ్కొనివచ్చిన వృద్ధుడు నిలువబడియుండెను. ఆతడు సరోజని తత్తరపాటు గాంచి నవ్వుచు, "సరోజనీ! నీవు తత్తరమందిన ప్రయోజనములేదు. మాయధీనురాలవైతివి. నిజముగ మోహనరావిచ్చటకు వచ్చునని యే తలంచితివా? కల్ల. నిన్ను రక్షించువారెవ్వరును యిచ్చట లేరు." అనెను.

ఆ పలుకులు వినినతోడనే సరోజని భీతిచే నొక్క కేకవైచెను. ఆ మందిరమునుండి పారిపోవలయునని యత్నించెను. కాని యెచ్చటను దారి కాన్పింపలేదు. చటాలున గదిద్వారమును చేరి యందు నిశ్చలముగ కూర్చుండియున్న వ్యక్తులం దిలకించి, "అయ్యలారా! ఇది న్యాయమా! అబలను మోసగించి బంధించుట ధర్మమా?" యని పలికెను. కాని వారికామె మాటలు చెవి కెక్కలేదు.

సరోజనీ పరిష్వంగసౌఖ్యమున కువ్విళ్లూరుచున్న వ్యక్తి కుర్చీ నుండి లేచి సరోజనిని సమీపించెను. "సరోజనీ! నీకొఱకు నామనము తల్లడమందుచున్నది. నీ సౌందర్యము నన్నాకర్షించినది. దయయుంచి నను చేపట్టుము. అప్పుడు నీవు లక్షాధికారిణి వయ్యెదవు. నీ విద్యకుఁ దగిన ధనము, గౌరవము నను పెండ్లాడుటవలన బడయఁగలవు. ఈవిశాఖ పట్టణమున నన్నెఱుంగనివారు లేరు. వలసినచో నా గుణగణాదుల గూర్చి నీ వితరులవలన దెలిసికొనగలవు" అని పల్కుచు నామె చేయి పట్టుకొనబోయెను.

సరోజని దూరముగపోయి, "ఛీ! మూఢుడా! ఇట్టి దురాగతంబుల నాచరించుచున్న నీవు గౌరవనీయుఁడవన నెల్లరు నవ్వుదురు. మోహాంధతచే యుక్తాయుక్తముల పరికింపక చరించుటగూడ గౌరవాస్పదకార్యముగానే భావించితివా? దుర్మార్గుడా! నా ప్రాణత్యాగమునకైన ననుమతింతునుగాని నీకోర్కె దీర్పఁజాలను. ఇప్పటికైన బుద్ధి తెచ్చుకొని నీ యభిప్రాయమును మార్చుకొనుము. లేకున్న నచిరకాలములోనే తత్ఫల మనుభవింతువు." అని గద్దింపసాగెను.

బలాఢ్యుడైన యాపురుషుని ముందట నబలయు, సుకుమారియునగు సరోజని వీరాలాపములు పనికి వచ్చునా? ఆతఁడు క్రుద్ధుడై, "సరే! నాప్రజ్ఞ చూతువుగాని లెమ్మా. ఓరీ! యీమెను మాటలాడకుండ నోట గుడ్డలు గ్రుక్కి కాలుసేతులు బంధించి మన కారులోనికి తీసికొనిపోయి బంధింపుము," అనెను.

వెంటనే యా వృద్ధుడామెను పట్టుకొని కేకలు వేయుటకు వీలు లేకుండ నామె నోట గుడ్డలు గ్రుక్కెను. ఆమె యాతని బారి నుండి తప్పించుకొని పారిపోవలయునని చాల పెనగులాడెను. గాని లాభము లేకపోయెను. ఆవృద్ధుడామెను బంధించివైచెను. తోడనే యందున్న వ్యక్తు లిరువురును బంగళావదలి యీవలనున్న కారులో

నెక్కిరి. వృద్ధుఁడు సరోజనిని భుజముపై వైచుకొని కారుకడకు వచ్చుచుండెను. అప్పటికి సూర్యుఁ డపరాంబుధి మునిఁగెను. చీకటులు గ్రమ్ముచుండెను.

వృద్ధుఁడు కారునకు పదిగజముల దూరమువరకు వచ్చెను. అంతలో ప్రక్కనుండి యొక తుపాకిగుండువచ్చి యాతని మోకాలునకు తగిలెను. వెంటనే యాతఁడు కూలబడిపోయెను. వాని భుజములపై నున్న సరోజనికూడ క్రింద పడిపోయెను. ఆపాటున నామె దక్షిణహస్తమునకు కించుక దెబ్బతగిలెను. భయముచే నామె యిదివరకే మూర్ఛాక్రాంతయై యుండుటచే నప్పుడు తగిలిన గాయ మామె యెరుగనే యెరుగదు.

తుపాకిశబ్దమును విని, వృద్ధుని యవస్థను దిలకించుచున్న కారులోని వ్యక్తులు వెంటనే కారును నడపి పారిపోయిరి. ఆ మరుక్షణముననే ముగ్వురు మనుజు లా స్థలమున ప్రత్యక్షమైరి. పాఠకులారా! వారు శ్రీనివాస మోహనరావులనియు, మూఁడనవాఁడు మోహనరావు మిత్రుఁడనియూ తెలిసికొనియుందురు. ఆ మూఁడవమనుజుఁ డా వృద్ధునిఁ దిలకించి, "ఓరీ! కారులో పారిపోయినవా రెవరు?" అనెను.

"నాకు తెలియదు."

"నిన్నిప్పుడే అరెస్టుచేసి శిక్షింపజేసెద. పారిపోయినవారి పేరుల నెరింగించినచో నీకుఁ గొంతవర కుపకార మొనర్చెద."

"నన్నరెస్టుచేయుటకు నీ కేమి యధికార మున్నది?"

"ఉన్న నేమి లేకున్న నేమి? నీవు నా యధీనమైతివి." అని పలుకుచు నాపురుషుఁడు తనజేబులోనుండి యీల పైకితీసి యూదెను. తోడనే నలువురు రక్షకభటు లా ప్రదేశమునకువచ్చి యాపురుషునకు వినయపూర్వకముగ నమస్కరించి నిలువఁబడిరి.

"వీనిని స్టేషనుకుఁ గొనిపోయి ఖైదులో నుంచుఁడు. నేనువచ్చిన పిదప వీనితో సంభాషించెద."

రక్షకభటులు చిత్తమని పలికి యా వృద్ధుని బంధించి తీసికొని పోయిరి. ఆ దృశ్యమును తిలకించుచున్న శ్రీనివాసరా వాశ్చర్యమందెను. ఆ మూఁడవపురుషుఁడు మోహనరావు మిత్రుఁడనియే భావించెను. ఇప్పుడు రక్షకభటులాతని యాజ్ఞ పాలించుట నాతఁడు పోలీసు యుద్యోగి యనుట స్పష్టము.

మోహనరావు మెల్లన సరోజనిని లేవనెత్తెను. ఆమె దక్షిణ హస్తముపైఁ జిన్న గాయమున్నది. మోహనరావు తన జేబురుమాలుతో నా గాయమునకుఁ గట్టుకట్టి తన మిత్రునివైపు చూచి, "కారు నిక్కడకు తెప్పించినచో సరోజనిని తీసికొని వెడలుము" అనెను.

అందులకా నూతనపురుషుఁడు, "తొందరపడకుము. ముందుగ నీమెకు స్పృహ గల్గించినగాని కారు ప్రయాణము శ్రేయస్కరము గాదు" అని పలుకుచు నాదారిని పోవుచున్న యొక బండివానిని పిలచి నీరు తెమ్మనెను. బండివాఁడును యథాసమయమునకు నీరు తెచ్చెను. ఆనీటిని యామె ఫాలముపై చిలకరించి, శీతలోపచారములు గావింప నామె తెలివిగాంచి తన ప్రక్కనున్న మోహనరావును గాఢముగ కౌఁగలించుకొనెను. ఆమె నేత్రములందును, ముఖమునందును గూడ భయము తాండవించుచుండెను పోలీసుఅధికారి యా బండివానిచేతనే వేఁడిపాలు దెప్పించి యామెచే త్రాగింపజేసెను. ఆమె పయఃపానమువలన నించుక శక్తి బడసెను. మోహనరా వామెనుగాంచి, "సరోజనీ! నడువ గలవా?" యనెను.

ఆమె మెల్లన 'ఊఁ' అని లేవబోయెను.

పోలీసుఅధికారి యామెను వారించి తానుబోయి కారు నటకు దోడ్కొనివచ్చెను. సరోజనిని మెల్లగ కారునెక్కించి శ్రీనివాస

మోహనరావులుగూడ కారులో కూర్చుండిరి. పోలీసధికారి కారు శర వేగమున నడిపించుచు నచిరకాలముననే శ్రీనివాసరావు గృహము చేరెను.

అప్పటికి సరోజనికి పూర్తిగా స్మృతి గలిగెను. తనంతతాను కారు డిని లోనికివచ్చెను. మిగిలినవారునుగూడ లోన ప్రవేశించిరి. అందరును సావడిలో నాసీనులైన పిమ్మట శ్రీనివాసరావు సరోజనిని చూచి, "సరోజనీ! నీవచ్చట కేగుట యెట్లు తటస్థించెను?" అనెను.

"ఒకవృద్ధుడు మాయింటికివచ్చి మోహనరావుగారిచ్చిరని చెప్పి యొక యుత్తరమును నాకిచ్చెను. నేను దానిని విప్పిచూచితిని. అయ్యది మోహనరావుగారు వ్రాసిన యుత్తరము. అందాతఁడు నన్ను బండిపై బీచ్‌కి రమ్మని వ్రాసెను. నేనా యుత్తరమును నమ్మి యా వృద్ధుడు సిద్ధపఱచిన గుఱ్ఱపుబండిపై బయలుదేరితిని ఆతడు నన్నచ్చట నున్న బంగాళాలోనికి తీసికొనిపోయెను. కొంతసేపటికిరువురు యువకు లచటకు వచ్చిరి వారిలో నొకడు నన్నుచూచి, నాయెడ తనకు మోహము గలిగినదనియు, నింకను నెన్నెన్నియో నింద్యాగర్భిత వచనం బుల బలుకసాగెను. నేను భీతినై పారిపోవ నుంకించితిని గాని క్రొత్తగ వచ్చిన యిరువురును నన్నచ్చటకు గొనివచ్చిన వృద్ధునిచే నను బంధింప జేసెను. భీతనై స్మృహతప్పి పడిపోయితిని తరువాత మీరందరును వచ్చి నాకు తెలివి గలిగించువరకు జరిగినదేమియు నాకు దెలియదు"

మోహనరా వాశ్చర్యమందెను. "సరోజనీ! ఆ యుత్తర మిప్పుడు నీవద్దనున్నదా?"

"ఉన్నది." అని పలుకుచు నామె మొలలోనుండి యుత్తరమును దీసి తనయెదుటనున్న బల్లపై నుంచెను మోహనరావా చీటిని తీసి చూచెను. అందలి ప్రత్యక్షరమును తన స్వహస్త లిఖితమును పోలియున్నది. మోహనరా వాశ్చర్యపడెను. శ్రీనివాసరావుచు,

ఆయుద్యోగియు కూడ నాయుత్తరమును పరిశీలించి యచ్చెర వందిరి.

సరోజిని మోహనరావు మాట ప్రకారము నడచుకొనుట కేదియేని కారణ ముండకతప్పదని వారందరును గ్రహింపగల్గిరి. సరోజిని శ్రీనివాసరావు సహాయమున తన గృహమున కరిగెను. పోలీసుఅధికారికూడ మోహనరావుకడ సెలవు గైకొని వెడలిపోయెను.

శ్రీనివాసరావు సరోజిని నామె యింటికడ దిగవిడచివచ్చి, " మోహనరావూ! పోలీసుల సహాయము తీసికొనవలదని చెప్పితివిగదా! ఇప్పుడా పోలీసధికారి సహాయమేల గైకొంటివి? " అనెను.

" వెఱ్ఱివాడా! నీకు నే నెట్టివాడనో, నా కాత డట్టివాడు. " అనెను. తరువాత నిరువురును భోజనములు ముగించి నిదురించిరి.

---

# పండ్రెండవ ప్రకరణము.



రామలాలు తనగృహమున సావడిలో కూర్చుండి యేదియో కాగితములు తిరుగవేయుచుండెను. అవన్నియు వర్తకులు వ్రాసియిచ్చిన ప్రోనోటుపత్రములు. అందుకొన్ని వాయిదా మగతులపై వ్రాయబడిన వగుటచే వానివాని వాయిదాలను పరికించుచుండెను. వాయిదాలు పూర్తిగా నున్న పత్రములనుతీసి వేరుగ పెట్టుచుండెను. ఆపత్రముల మొత్తములును వేరువేరుగ పద్దులు వ్రాసుకొనుచుండెను.

ఆసమయమున నొకభిక్షుకువచ్చి రామలాలు గృహద్వారము చెంత నిలువబడి, " బాబూ! బాబూ. " అని పిలచు చుండెను

లాలా కేదారి వీధిలోనికి తొంగిచూచెను. వారముదినముల క్రిందట వచ్చిన భిక్షుడే యాతడు. ఆతని జూచినవెంటనే లాలాతని వారము వెనుకలపిడప కనబడమని చెప్పిన మాట జ్ఞప్తికివచ్చెను. కాని ప్రస్తుత మాతని జీవనోపాధి చూపించుటకుం దగిన మార్గము కనుపింపలేదు. అయినను వచ్చినవాని నూరక పంపివేయుట భావ్యము కాదని తలంచి యాతనిని లోనికి రమ్మనెను. భిక్షుడును లోనికివచ్చి వినయపూర్వకముగ లాలుకు నమస్కరించి యొకమూల నిలువబడెను. లాలాతనిని కూర్చుండుమని సంజ్ఞ గావించెను. తన కాగితములను చూచుకొనుట మానలేదు. భిక్షుకుమాత్రము గుమ్మముకడనే కూర్చుండి యూరక వెఱ్ఱివానివలె నా సావడినంతయు పరికింప దొడంగెను.

రామలాలు కాగితముల నన్నియు సర్దుకొని లేచెను. అప్పటికి నాలుగుగంటలు దాటిపోయినది. ఆ కాగితము లన్నియు దొంతరచేసి కట్టకట్టి యా కట్ట చేతంబట్టుకొని మేడపైకిం బోయెను. ఆతండు లేచునప్పుడు ఆతని రొండిలోనుండి యొక చీటి క్రిందపడిపోయెను. లాలు ఆ చీటిని పరికింపనేలేదు. కాని యయ్యది భిక్షుని దృష్టిపథమునుండి తప్పిపోలేదు. భిక్షుండును లాలు పైకి వెడలిపోవుటతోడనే లేచి చటాలున నా చీటి నందికొనెను దానిని విప్పి చూడబోవునంతలో మేడ మీదనుండి యెవ్వరో దిగుచున్నట్లు అడుగుల చప్పుడు వినవచ్చెను. అందుచే నాతండా కాగితమును తన వస్త్రములో భద్రపరచుకొని యెప్పటియట్ల నా స్థానముననే కూర్చుండిపోయెను.

లాలు తిరిగివచ్చెను. వచ్చునప్పుడు తనతోంగూడ నొక క్రొత్త పంచియు, రెండురూపాయిలును తీసుకొనివచ్చి యా భిక్షున కొసంగి, “ ఓయీ! నే నొక పెద్దమనిషికొఱకెదురుచూచుచున్నాను. ఆతండు వచ్చినగాని నీ కేదయిన పనికల్పించుట కవకాశము లేదు. మరి పదిదిన

ము లభించవలసిన చెప్పెదను. ప్రస్తుత మీ బట్టయు సొమ్మును గైకొని సంతోషింపుము." అనెను.

ఆహా! రామలాలు యౌదార్యము! ఎందరెందరు లక్షాధికారులనో చూచితిమిగాని లాలువంటి యుదారపురుషుం డొందును లేడని సే చెప్పవచ్చును. ఆ భిక్షుకుండును పరమసంతోషము నభినయించుచు, లాలొసంగుచున్న యా వస్తువులను గైకొని వినయంబున మరల నభివందన మాచరించి, లాలుకడ సెలవుం గైకొని వెడలిపోయెను.

ఆ భిక్షుకుండు లాలు గృహము దాటి యిరువదిగజములు పోయి వెనుకకుదిరిగి చూచెను. లాలు గృహమువద్ద నొక్కరుడును కానుపింప లేదు. అప్పటికి స్వస్థహృదయుండై తన బట్టలలో దాచుకొనిన చీటి పైకి తీసెను. ఆ చీటి మడతలువిప్పి యిట్లు చదువసాగెను.

"లాలుగారూ!

మీ యాజ్ఞప్రకారము సరోజనిని వశపరచుకొనుటకు యత్నించుచునే యున్నాను. కాని యింతవఱకు సఫలీకృతుండను గాలేదు అచిర కాలములోనే మీకోర్కె నెరవేర్పగలనని వాగ్దాన మొనర్చుచున్నాను. మీరు నాకొనర్చిన మహోపకారమునకు నీపాటి శ్రమకోర్చి నా కృతజ్ఞతను వెల్లడించుకొనవలయునని తలంచుచున్నాను. విశేషాంశము లవకాశముచబట్టి ముఖస్థముగ మాట్లాడ యత్నించెదను.

ఇట్లు,

నీ ముఖ్యానుచరుడు."

"ఆహా! రామలాలుకూడ దుష్టులలో నొకడగునేమోయని యున్న నాయనుమానము నేటికి ధృవపడినది. ఈతడు సరోజనినిగాంచి మోహపరవశుడై యుండెనుగాబోలు. ఓరిదుర్మార్గుడా! నీకెంత కండ కావరము! అచిరకాలములోనే నీపాపము బయలుపడి తగిన ప్రతి

ఫల మనుభవింపగలవు." అని యింకను యేమేమో గొణుగుకొనుచు వెడలిపోవుచుండెను.

పాఠకులారా! ఆభిక్షుకు డెవ్వరని మీ రూహించుచున్నారు? మోహనరావనియే నాయభిప్రాయము! అవును నిశ్చయమే! శ్రీనివాసునకు సంబంధించిన యభియోగమున పనిచేయుచున్నది మోహనరావు గాక మరెవ్వరు? కావున నాతడు మోహనరావని నిర్ధారణ చేయుటలో పొరబాటులేదు. కాని మాకును ఒకవ్యక్తి యాభిక్షుకునివైపునకే వచ్చుచున్నాడు. ఆత డెవ్వరో చూచితిరా? అతడే మోహనరావు- ఆశ్చర్యము?.........భిక్షుడు మోహనరావు కాడు! ఈతఁడెవ్వరో?

తనయెదుటబడిన మోహనరావునకు నమస్కరించి యాబిచ్చగాడు "బాబూ! మీరు నాకేమియు దాన మొసంగ దలంపవనుట నేనెఱుంగుదును. అయినను మీ కుపకారము గావింపవలయునని నాకుఁ గుతూహలముగనున్నది. ఈచీటి తీసికొనుడు." అని పలుకుచు నాతడు తనబట్టలలో భద్రపఱచుకొనిన చీటితీసి యాతని కందించెను.

మోహనరా వాశ్చర్యముతో చీటినందికొని, "నీవెవరవు?" అని ప్రశ్నించెను. భిక్షగాడు, "నాసంగతి మీకేల? మీ ప్రయత్నమున మీరుండుడు." అని పల్కుచు రివ్వున నాస్థలమునుండి వెడలిపోయెను. మోహనరావు చకితుఁడై యాతడు పోయినవైపే చూచుచుండెను. ఆయాచకుడు తన దృష్టిపథమునుండి దాటిపోయినపిదప మోహనరావు చీటినివిప్పి చదువుకొనెను. ఆతని యాశ్చర్యము ద్విగుణీకృతమయ్యెను. అట్టి యమూల్య రహస్యమును తన కెఱింగించిన యా వ్యక్తి నిజముగ తన శ్రేయస్కామియని యాతఁడు భావించి తన యంతరంగమున నే యాతనికి నమస్కరించెను.

ముందు తా నాచరింపవలసిన పని యేమాయని యాలోచింప దొడంగెను. అప్పటికి చండభానుఁ డాకసమధ్యభాగంబున దన సంపూర్ణ

తేజస్సుతో ప్రకాశించుచు పాంథులకు తాపము గల్గించుచుండెను. మోహనరావుకూడ యెండవేడిమికి తాళలేక యప్పటి కింటికిబోయి భుజించినపిదప కర్తవ్య మాలోచింపవచ్చునని తలంచెను. వెంటనే యాతఁడు వెనుదిరిగి శ్రీనివాసరావు గృహమువైపు నడువసాగెను.

---

# పదమూడవ ప్రకరణము.

"సృష్టిరహస్యము గుర్తెరుంగజాలని విద్య వ్యర్థముకాదా?"

"శాస్త్రపరిజ్ఞానముకూడ నించుక గలిగియుండవలెను. ఏశాస్త్రములోనైన నిట్లొనర్పవచ్చునని వ్రాయఁబడియున్నదా?"

"లేదు. అయినను యేదియైన నూతనకృత్యము నొక మహాపురుషుఁ డాచరించిన, నయ్యది జనబాహుళ్య మంగీకరించిన నట్టి కార్యము శాస్త్రసమ్మతముగానే పరికించి మానవు లాచరణలో బెట్టుకొనవలసియుండును"

"అట్లైనను నట్టికిని జరుగకూడదు."

"కూడదనుట పొరబాటు అట్లు జరిగించుట మీ కంగీకారము లేదనుట యుత్తమము."

"ఎందుచేత?"

"అయ్యది యపయశము గల్గించును. మన ముత్తమవంశసంజాతులము. మనమే యట్టికార్య మాచరించిన పాటివారు నవ్వుదురు."

"లోకులు కాకులవంటివారు. వా రేమిమో నిందింతురని తలంచుట తెలివితక్కువ. నే చెప్పినట్లు గావించిన మిమ్ము గొనియాడువారు చాలవరకుందురనుట నిస్సంశయము."

" ఉండవచ్చునుగాని నేనాకీర్తిని గణింపను. "

" కీర్తిని గణింపని వారపకీర్తి మాత్రమేల గణింపవలయును? కీర్తియు, నపకీర్తియు ప్రాజ్ఞులకు సమములేగదా? "

" అట్లని యపకీర్తి మార్గమును బుద్ధిపూర్వకముగ నవలంబించుట మానవ లక్షణముగాదు. "

" అయిన క్షమింపుడు. నాకు సెలవొసంగినచో నేను పోయెదను. "

" ఎచ్చటికి పోయెదవు? "

" నాయిచ్చవచ్చిన చోటుకు. నాపల్కులయందు గౌరవముంచు వారుండుచోటుకు. ఇచ్చట నాకేమిపని యున్నది? నేననవరతమేవ్యక్తిసౌఖ్యమునకై పాటుపడుచుంటినో, యావ్యక్తికి సుఖమొసంగ్పలేని నాజీవితము వ్యర్థము. "

" అయిన కులకళంక మార్గ మవలంబింప కెంచితివా? "

" శరీర మాద్యం ఖలు ధర్మసాధనంబను సూత్ర మవలంబించి ముందు శరీరసుఖమునకు పాటుబడ నెంచితిని. "

" నీ వాదన సమంజసముగాదు. "

" మీకు సమంజసంబుగ లేకున్నమానె. నాహృదయ మాకార్య మనశ్యాచరణీయమని బోధించుచున్నది "

" అటులయిన నీవు నాయాజ్ఞ పాలింపవా? "

" ఏవిషయమైనను శిరసావహింతునుగాని, యీవిషయమున నా ప్రతిన నెరవేరనిచో నిక నాకీగృహముతో సంబంధ మిసుమంతయు నుండదని నిక్కముగ చెప్పగలను. ఇది నా మనోనిశ్చయము. నన్నకారణముగ నిందింపవలదు. బాగుగ నాలోచించుకొనుడు. "

అని మాధవరావుగారి సావడిలో నిరువురు కూర్చుండి సంభాషించుచుండిరి. వారిరువురుగూడ మనకు పరిచయులే. అందొకడు

మాధవరావు. రెండవయాతఁడాతనికుమారుడు సుదర్శనమూర్తి. వారిరువురంత తీవ్రముగ సంభాషించుచుండు యావిషయ మేదియో! ఆవిషయమున వారిరువురకు నభిప్రాయ భేధములు కలుగుటచేత సుదర్శనమూర్తి యాగృహముతో తనకుఁగల సంబంధము సంపూర్ణముగ వదలుకొన వలయునని నిశ్చయించుకొనెను. కాని ప్రాజ్ఞుడై యన్నివిధంబుల తనకు చేదోడు వాదోడుగానున్న జేష్ఠకుమారుని విడనాడుట కాతని మన సంగీకరించునా? అంగీకరింపక కులవిరుద్ధ కార్యమాచరించునా? మాధవరావున కేమిచేయుటకును దోచలేదు.

ఎట్టకేల కాతడు కుమారునివైపుతిరిగి, "సుదర్శనం! నీవటు వదలకున్నావు. నేనీ విషయమున బాగుగ నాలోచించినఁగాని యే ప్రత్యుత్తరము నొసంగజాలను. గావున నాకు వారముదినములు గడు వీయవలయును." అనెను.

ఆమాటలకు సుదర్శనమూర్తి యంగీకరించెను. "అటులనే యాలోచించుకొనుడు. తొందరేమియు లేదు. వారము దినములలో మించినదేదియు లేదు." అని పలుకుచు నాతడు కుర్చీపైనుండి లేచెను రెండునిముసము లచటనే నిలువబడియుండి తదుపరి తనగదిలోనికి బోవలయునని బయలుదేరెను. గుమ్మమువద్దకు పోవుపరికి యాతడు నిర్విణ్ణుడై పోయెను. లోన నేమున్నది! సరోజని జీరాడుచున్న తలవెండ్రుకలతో- మాసినవసనముతో నామె దుఃఖాక్రాంతయై మంచముపై బరుండి యేడ్చుచుండెను. సుదర్శనమూర్తి యామె నట్టిస్థితిలో నెన్నడునుచూచి యుండలేదు. విద్యావతి- ప్రపంచజ్ఞానము గ్రంధావలోకనము గడించిన సరోజని యట్లు విలపించుట సుదర్శనమూర్తికి హృదయ నిర్భేదకరముగ నుండెను.

సుదర్శనమూర్తి చటాలున లోనికిజని సరోజని పరుండిన మంచముపై కూర్చుండి, "సరోజనీ దుఃఖింపవలదని చెప్పలేనా

సూర్యచంద్రాదులు గతులు తప్పినను నా ప్రతిజ్ఞ నెరవేరక తప్పదు. నీకు చదువు వలదని తగవులాడిన తండ్రి యిప్పుడేమయ్యెనో చూచితివా? వివాహమగువరకు గాతఁడాటంకపఱచునుగాని— వివాహానంతర మేమి చేయుగలఁడు? సత్యముగ నాతఁడు నీ వివాహమున కంగీకరింపనిచో సన్నేదియో మిమ్మవన్ని నా తావునకు రప్పించుకొని యచ్చట వివాహము జరిపించెద. తరువాత వీ రేమిచేయుదురో చూచెద " నని పల్కుచు యామెను లేవదీసి తన చేతిరుమాలుతో నామె కన్నీరు తుడిచెను. సోదరుఁ డాచరించిన ఘోరప్రతిజ్ఞ యామెకు హృదయశాంతి నొసంగినది.

మాధవరావు తన కుమారుడు గదిలోనికి పోబోవుచు నవ్వేరఁబడుట ముస్నగువ వన్నియు తిలకించెను. అంతియగాదు — సుదర్శనమూర్తి గదిలో ప్రవేశించినవెంటనే తా నా గుమ్మమువద్దకువచ్చి సరోజని దుస్థితి కన్నులార గాంచెను. సుదర్శనమూర్తి యామె కాచరించిన ఘోరవాగ్దానముఁగూడ వినియుండెను. తన కుమారుడు దృఢప్రతిజ్ఞుఁడనిగూడ యాతఁడు పూర్తిగ యెరుంగును. అట్టివాని కెదురాడి విజయముగాంచుట తన కసంభవమని యాతఁ డెరుంగును. అందుచే నాతనిహృదయ మాందోళన మొందసాఁగెను. ఎట్లైనను యాతఁడిప్పుడు తన కుమారుని కోర్కెఁ దీర్చవలసినదే! మాధవరావు యథాస్థానమునకు చేరి కూర్చుండెను. అతఁడు సరోజని దురవస్థ చూచినట్లుగాని, లేక సుదర్శనమూర్తి యాచరించిన ప్రతిజ్ఞ వినినట్లుగాని యాతని కెఱిగింపరాదని యాతని యుద్దేశము.

సరోజని నోదార్చి సుదర్శనమూర్తి యీవలకు వచ్చెను. తండ్రి యథారీతిని కుర్చీపై కూర్చుండెను. " నాయనగారూ! బజారులోనికి వెళ్ళివచ్చెదను. " అని పలుకుచు ప్రత్యుత్తరముకొఱకు నిరీక్షింపకయే వెడలిపోయెను.

సుదర్శనమూర్తి వెడలిపోయినపిదప సరోజని మెల్లగలేచి యీవలకువచ్చెను. ఆమె నునుచెక్కిళ్ళు కన్నీటిధారలచే చారలు వడియెను. ఆమె ముఖమును తిలకించినంతనే మాధవరావు హృదయము కరిగిపోయెను. అతఁ డేమియు నెరుంగనట్లు, "సరోజనీ! నీ మోమట్లు చిన్నబోయి యున్న దేమి?" అనెను. కాని యీ ప్రశ్నకు సరోజని జవాబొసంగలేదు. తల వంచుకొని పెరటిలోనికి వెడలిపోయెను.

---

## పదునాల్గవ ప్రకరణము



"మోహనరావూ! ఉదయమున నేదియో విచిత్రము జరిగిన దంటివి. అదేమి?"

"చెప్పెదనుగాని-నీవుదయమున నెచ్చటకైన వెళ్ళితివా?"

"లేదు. నే నీదిన ముదయమునుండియు వీధిగుమ్మము కండ్లజూడలేదు."

"నే నుదయమున కాఫీ తీసికొనినపిమ్మట యీ సమీపమున నే గల నా మిత్రు నొకని దర్శింప నేగితిని. అతనితో సంభాషించుచుండ నాతఁడు మాటలవరుసను యీయూరున కావల నూతనముగ నిర్మింపబడిన భవనంబున నివశించుచున్న రామలాలను మారువాడీ యించుక సందేహింపతగినవాఁడుగ నున్నట్లు తోచుచున్నదని తెలిపెను. అప్పటికి పదిగంటలు దాటిపోయినది అయినను యీ భవనమునైన కండ్ల చూడవలెనను యభిలాషతో నాతఁ డెరింగించిన యానవాళ్ళ ననుసరించి పోదొడంగితిని. భవనమల్లంతదూరములో కాన్పించుచున్నది. ఆ సమయమున నొకయాచకుఁడు నా కెదురయ్యెను. అతని నే నెన్నఁడును చూచియుండలేదు. గాని నన్ను బాగుగ నెరింగినవానివలెనే నా పేరుతో

సంబోధించి నా కొక యుత్తర మొసంగెను. నే నా చీటి నందికొని యాతని వృత్తాంత మెఱుంగవలయు నను నుద్దేశమున నాతని బ్రశ్నించితిని. గాని యాతం డేమియు ప్రత్యుత్తర మొసంగకయే వెడలిపోయెను. నాకు చాల యాశ్చర్యము కలిగినది. ”

“ ఆ చీటిలో నేమున్నది? ”

“ ఇదిగో చీటి. దీనివలన నా మిత్రుం డెరింగించినది నిశ్చయ మయ్యెను. ”

మోహనరా వొసంగిన చీటి గైకొని శ్రీనివాసరావు చదువుకొనెను. ఆతని కాశ్చర్య మగ్గలమయ్యెను.

“ అయిన నాడు కారులో నున్నవారిలో నొకడు రామలా లనుకొందును. ”

“ సందేహమేమి? ఈ యుత్తరమువలన మన మట్లే యూహింపవలసియున్నది. ఊహించుటయే గాదు - నిశ్చయింపవలసియే యున్నది కాని యియ్యది వ్రాసినవా రెవరో బోధపడుటలేదు. కారులో కూర్చున్న రెండవ యాతడా? లేక మనచే బంధితుడైనవాడా? యని సందేహము గల్గుచున్నది. ”

“ మనచే బంధితుడైనవాడు చెరసాలలోనుండి యుత్తరమెట్లు వ్రాయగలడు? ”

“ ఏమో! తప్పించుకొని పారిపోయెనేమో! నాకెట్లు నిశ్చయించుటకును దోచకున్నది. దానినటు లుంచుము. ముందీ భిక్షకు డెవడో తెలియవలయునుగదా? ”

“ అవును. ఆతనికీ విషయమున నేమిసంబంధమున్నదో. ఆతడు నిజముగ మన కుపకారము చేయవలంచియే యిట్లొనర్చి యుండు నందువా? ”

"అదియు ననుమానమే. కానిమ్ము. దీని కింతయాత్రమేల? క్రమముగ నన్నియు బోధపడగలవు."

"సరి కాని-నీవింకను వివాహము చేసికొనలేదేమి?"

ఆ ప్రశ్నకు మోహనరావునకు నవ్వువచ్చెను. "రామాయణములో పిడుకల వేట్లాటయనునట్లు మన మొక తీవ్రసమస్యలో మునిగియున్నప్పుడీ వివాహపుగొడవ యేమనకు?"

"అట్లుకాదు. ఒకచోట నుండి సంబంధమున్నది. అందుచే నడుగుచుంటిని."

"ఏమా సంబంధము!"

"ఒకపిల్లయున్నది. ఆమెకు వయస్సు పదునారు వత్సరములున్నవి. విద్యావతి. చక్కని చుక్క."

"పేరు?"

"తరువాత చెప్పెదనులెమ్ము ముందు నీయభిప్రాయమేమి?"

"కులశీలాదులను తెలుసుకొనకనే చెప్పుమందువా?"

"పోనిమ్ము వాకద నాపక యథార్థ మెరిగింపుము. నీవిదివర కెవరినైన ప్రేమించితివా?"

కొంతసేపటివరకు మోహనరావేమియు ప్రత్యుత్తరమీయంగ లేదు. తాను సరోజనిని ప్రేమించినమాట యథార్థమే. శ్రీనివాసరావు సంగతి యేమాత్రమో గ్రహించి యిట్లడుగుచున్నాడని తలంచెను. కాని యా రహస్య మాతని కెరింగింపవచ్చునా? కూడదా? యను సందేహ మాతని పీడింప నారంభించెను. ఏమి విచారణ చేయుటకును నాతనికి దోచలేదు. అతని యాలోచనము చూచి శ్రీనివాసరావు మరల నాతని నా ప్రశ్నయే వేసెను.

"లేదు."

“ నేను నమ్మను. నీవు మనసార నొకవ్యక్తిని ప్రేమించితివి. ప్రథమదర్శనముననే నీహృదయము నామె సౌందర్య మాకర్షించెను. నే నెరుంగుదును. కాని యాతరుణి విషయమై నీకొక ముఖ్యాంశ మెరింగింప వలసియున్నది. ”

“ ఏమా యంశము? ”

“ చక్కని ప్రశ్నవైచితివి. ఇప్పుడు నీవొక యువతిని ప్రేమించిన మాట యదార్థమని తెల్లమయ్యెఁ గదా! ”

మోహనరావు మాటాడలేదు.

“అటులనే యనుకొనుము. నీవు చెప్పఁదలంచిన దేదో చెప్పుము”

“ చెప్పుటకేమున్నది. నీవు ప్రేమించిన తరుణి వితంతువు. ”

మోహనరా వాశ్చర్యమందెను. “నిజముగ సరోజని వితంతువా లేక వేరొకరి విషయమును గూర్చి చెప్పుచుండెగా? ” యని తనమనంబున దలపోయసాగెను.

“ ఇంకను ఆలోచించెద వేల? సరోజని వితంతువు. ఆస్వల్ప కారణము మీయిరువుర ప్రేమప్రవాహము నడ్డఁగట్టఁగలదా? ”

మోహనరావు సంశయము పూర్తిగా నివారణమయ్యెను. అసంభవము. శ్రీనివాసరావూ! నేను పూర్వాచార పరాయణుఁడ గాను. దేశకాల పాత్రల ననుసరించి ప్రవర్తింపవలయును. ఈకాల మున వితంతు వివాహములు తప్పులేదు. ” అనెను.

శ్రీనివాసరావు చిరునవ్వుతో, “మోహనా! నీమనోనిశ్చయము చాలగొప్పది. ఈవిషయమునుమాత్ర మెచ్చటను వెలిఁబుచ్చకుము. సరోజని వితంతువను సంగతి మూర్తి-ఈయూరనేగాదు- యీపరిసరప్రాంత ములు- నెవ్వరికిని దెలియదు. ఈవిషయ మొకానొక సమయమున నాకామెయన్న యెరింగించెను. ” అనెను.

మోహనరావేదియో చెప్పఁబోయెను. గాని యింతలో కమల కాఫీతో ప్రవేశించుటచేత వారిసంభాషణ యాగిపోయెను. కమల కాఫీగ్లాసుల నటనున్న బల్లపైనుంచి వెడలిపోయెను. ఇరువురు కాఫీ తీసికొనిరి.

మరికొంతసేపటికి వీధిద్వారముకడ నెవ్వరో పిలచిరి. శ్రీనివాసరావు తలుపు తెరచెను. నాఁడు సరోజనిరక్షణకై తమతో వచ్చిన పోలీసుఅధికారి గుమ్మముకడ ప్రత్యక్షమయ్యెను.

శ్రీనివాసరావు వినయపూర్వకముగ నాతని కభివందనమొనర్చి స్వాగతమొసంగెను. ఆతఁడు లోనికివచ్చి మోహనరావున కభివాదమొనర్చి యటనున్న వేరొకకుర్చీపై నాసీనుఁడయ్యెను. మోహనరావాతని దిలకించి, "ఏమండీ! ఇనస్పెక్టరుగారూ! ఎన్నఁడు రాని వారిట్లు వచ్చితిరి? " అనెను.

" మోహనరావుగారూ! పోలీసువారు ఎంతజాగరూకులో అంత యవివేకులు. వారి తెలివితక్కువవలన మనము నాఁడు బంధించిన వృద్ధుఁడు తప్పించుకొని పారిపోయినాఁడు "

మోహనరావు నిర్విణ్ణుఁడయ్యెను. " ఎంత ప్రమాదము జరిగినది. ఎప్పుడు పారిపోయెను? "

---

## పదునైదవ ప్రకరణము.

శ్రీనివాసమోహనరావు లినస్పెక్టరుగారితో కలసి కొంతదూరము నడిగినపిదప శ్రీనివాసరావు తనకేదియో పనియున్నదని చెప్పి కాలేజీవైపునకు వెడలిపోయెను. ఇనస్పెక్టరు మోహనరావును వెంటఁబెట్టుకొని స్టేషను చేరిరి. ఇరువురును నాసీనులైరి.

"ఎప్పుడో తెలియదు. నాల్గుదినములనుండి నేనాతని విషయమై శ్రద్ధవహింపలేదు.

"పారాకాయు దక్షకభటుల విచారించితిరా?"

"నేడు జైలు తణిఖీదినము. ఉదయముననే నెం 147, 275రులు గల రక్షకభటులు పరుగుపరుగున నావద్దకువచ్చి వృద్ధుఁడు పారిపోయెనని చెప్పిరి. నేను వారిరువురను పరీక్షించి, స్టేటుమెంటులు తీసికొంటిని"

"అసత్యము. అతఁడు పారిపోయి అధమము మూఁడుదినములైనఁ గావలయును."

"ఎట్లు చెప్పగలరు?"

"కారణములున్నవి. సావకాశముగ మీతో చెప్పుటకు బయలుదేరవలయునని యనుకొనుచుంటిమి. ఇంతలో మీరే యిటకు వచ్చితిరి."

"మీరు శ్రమపడి యంతదూరము రానగత్యములేకుండ భగవంతుఁడే నన్నిటకంపెను."

"వలదు. ఇచ్చటావిషయముల ముచ్చటింపరాదు. శ్రీనివాసరావునకు చాలమంది స్నేహితులు గలరు. వారు సాధారణముగ వచ్చుచు బోవుచు నుందురు.

"అయిన నెక్కడ ముచ్చటింతము?"

"స్టేషనుకే వెళ్ళుదము. వృద్ధునుంచఁబడిన గదినికూడ పరీక్షింపవలయునుగదా!"

"సరే? అయిన నాలస్యమెందులకు? అప్పుడే నాల్గుగంటలయినది."

ముగ్గురును లేచిరి. శ్రీనివాసరావు లోనికరిగి కమలతో నేమియో చెప్పి మరల యీవలకు వచ్చెను. అంత నాముగ్గురును బయలుదేరి పోలీసుస్టేషనునకు వెడలిరి.

# పదునైదవ ప్రకరణము.



శ్రీనివాసరావు మోహనరావు లినస్పెక్టరుగారితో కలసి కొంతదూర మరిగినపిదప శ్రీనివాసరావు తనకేదియో పనియున్నదని చెప్పి కాశే జీశ్వైఫునకు వెడలిపోయెను. ఇనస్పెక్టరు మోహనరావును వెంటఁ బెట్టుకొని స్టేషను చేరి. ఇరువురును నాసీనులైరి.

ఇనస్పెక్టరు జైలునకు కావలిగానున్న నెం 147. 275, గల పోలీసుభటులను పిలపించి మోహనరావు యెదుట నిలుచఁబెట్టెను. మోహనరావు వారి ముఖవైఖరి బాగుగ పరిశీలించెను.

మోహనరావు యాజ్ఞకై నెం 147 భటుఁడు ముందునకు వచ్చెను.

" నీ పేరేమి? "

" నారాయణ "

" నీవెంతకాలమునుండి పోలీసుశాఖలో పనిచేయుచున్నావు? "

" ఎనిమిది సంవత్సరములనుండి. "

" పోలీసుభటుల విధ్యుక్తధర్మములన్నియు నీకుఁ బాగుగఁ దెలియునా? "

" తెలియదు. "

" మూఁడుదినములలోపున నీ వే యే సమయములందు కారాగారమునకుఁ గావలికాసియుంటివి? "

" మొన్నటిదినమున రాత్రి యెనిమిదిగంటలు మొదలు పదిగంటలవఱకును, నిన్న రాత్రి పండ్రెండు మొదలు రెండుగంటలవఱకును. "

" ఆసమయములలో నెం 4 రు గదిలో వృద్ధుఁ డున్నాడా?

"ఉన్నాఁడు."

"నీ తరువాత నా బీటునకెవరువచ్చిరి!"

"నెం 275 రు రామనాధము."

"ఆతనికి గదుల యంగలి పైదీ లంగరును చూపి వప్పగించితివా?"

"లేదు."

"ఎందుచేత?"

"తొలుతనుండియును మాలోమాకుఁ గల నమ్మకముచే నట్లే జరిగిపోవుచుండెను. ఆతఁ డంగరను చూపుమని యడుగలేదు. నేను చూపలేదు."

"ఈవిషయమున నీవు రక్షకభటుల విధికృతధర్మములఁ దప్పినట్లంగీకరింతువా?"

"అంగీకరింతును."

మోహనరావు తన ప్రశ్నలను వానికి నారాయణ యొసంగిన ప్రత్యుత్తరములనుగూడ నొకకాగితముపై వ్రాసెను నారాయణను ప్రక్కకు పిలచి యా కాగితముపై సంతకము చేయుమనెను. నారాయణుడు ప్రథమతప్పిదమున్న క్షమింపుఁడనియు పిల్లలుగలవాఁడనియు, తన యవివేకమధికారుల కెరింగించి తన కడుపు కొట్టవలదనియు ప్రార్థించుచు కంపితకరంబున నా కాగితముపై సంతకముచేసెను. "సరే నీ విఁక పోవచ్చును." అని మోహనరావాతని బంపివైచి రామనాధమును పిలచెను: నారాయణ నడిగిన ప్రశ్నలే యాతనిని గూడ ప్రశ్నించి సమాధానములఁ బడసెను. ఆ ప్రశ్నోత్తరములఁగూడ నొక కాగితముపై వ్రాసి రామనాధముచే సంతకముచేయించుకొని యాతనిని గూడ పంపివేసెను.

మోహనరావు ముఖము గంభీరమయ్యెను. ఇనస్పెక్టరుగారూ! వృద్ధుఁడు పారిపోవుటలో మీరుకూడ కొంతభాధ్యత వహింపవలసి యున్నది. " అనెను.

ఇనస్పెక్టరు తెల్లఁబోయెను. ఆ యపరాధము నాతని నెత్తిపైఁ గూడరుద్ది యాతనికీర్తికిఁ గళంకమాపాదింప మోహనరావెంచుచున్నట్లు యినస్పెక్టరూహించెను. నిన్నకాక మొన్న డిటెక్టివుపదవిఁబొందినను, మోహనరావునకు చాల యనుభవము, ప్రభుత్వములో పలుకుఁ బడి యున్నదని యాతఁ డెరుంగును. మోహనరా వేమివ్రాసినను, పై యధి కారులు తప్పక యందుల కామోదింతురు. ఇనస్పెక్ట రీవిషయము లన్నియు బాగుగ నాలోచించుకొని, " అవును. కొంతకాదు. పూర్తి గనే వహింపవలసియున్నది. అందుచేతనే నాకు రానున్న విపత్తునుండి దప్పింతురను యూహతో నీ విషయ మెఱింగిన వెంటనే మీకొఱకుఁ బరువెత్తుకొనివచ్చితిని, " అనెను.

" సంతోషము. మీతప్పును మీ రంగీకరించినందులకు సంతో షము. కాని యిప్పుడు కర్తవ్యమేమి? నాకుఁ జూడ నీ రక్షకభటు లిరువురయందునుగూడ ననుమానముగ నున్నది. వారిని క్షమించినచోఁ బ్రమాదమువచ్చును. యీవిషయము పైకి తెలియఁజేసిన మీకు మాటవచ్చును. ఇవుడేమి కర్తవ్యము? "

" సర్వజ్ఞులగు మీ కెరింగింపగలవాఁడనా? మీరే తగిన యుపా య మాలోచింపుడు. "

మోహనరావు దీర్ఘాలోచనానిమగ్నుఁడయ్యెను. పదిపదునైదు నిముసములు గడచినపిదప నేదియో నిశ్చయమునకు వచ్చినట్లు తల యూపెను. " సరే. ప్రస్తుత మీకాగితములను యొరు లెరుంగకుండ భద్రపఱచియుంచుడు. ఆ భటు లీ కాగితముల విషయ మడిగినచో మీ కేమియు దెలియనట్లును. నేనే యా కాగితముల గొనిపోయినటును చెప్పుడు. "

"చిత్తము" అని పలికి యినస్పెక్టరా కాగితముల మడచి జేబులో నుంచుకొనెను.

ఇంతలో నాతృతతో సుదర్శనమూర్తి వచ్చి మోహనరావును చూచి, "మోహనరావుగారూ! మీతో కొంచెము మాటలాడవలసియున్నది యొక్కపరి యీవలకు వచ్చెదరా?" అనెను.

మోహనరావు సుదర్శనమూర్తివెంట యీవలకు వచ్చె. సుదర్శనమూర్తి యాతనికొక యుత్తరమొసంగెను. మోహనరావు దానిని విప్పిచూచెను.

"బంధితను-వార్తేరు-సాయమవసరము-సరోజని."

మోహనరావు శరీర కంపాపాదమస్తకము వడకసాగెను. చటాలున లోనికిఁబోయి ఫోనులో డి. యస్. పి. దొరగారిని పిలచెను. ఆయానవద్దనుండి జబాబు వచ్చినంతనే తాను సి. ఐ డి. మోహనరావనియు, నావశ్యకకార్యము పై వాల్తేరు వెళ్ళవలసి వచ్చుటచే కారు స్టేషనుకు పంప ప్రార్థించుచుంటిననియు చెప్పెను. డి. యస్. పి. దొరగారి వద్దనుండి యంగీకారము దెలుపుచు ప్రత్యుత్తరము వచ్చెను. మోహనరావు హృదయభార మించుక తగ్గెను. అతఁడు బయట తనకొఱకు నిరీక్షించుచున్న సుదర్శనమూర్తిని కేకసికొని "సుదర్శనమూర్తిగారూ! కారు వచ్చుచున్నది. కారుపై వెళ్ళుదముందుము." అనెను.

మోహనరావు యాత్రము దిలకించుచున్న యినస్పెక్టరుగారు "ఏమిజరిగినది?" అని ప్రశ్నించిరి. మోహనరావు తనచేతిలోని చీటి నాతని కొసంగెను. ఆచీటిచూచి యినస్పెక్టరు తెల్లబోయెను.

ఇంతలో కారువచ్చి స్టేషనునద్ద నిలచెను. "యినస్పెక్టరుగారూ నాపేర పన్నువ్రాసి నాల్గుతూటాలు నొసఁగుఁడు. అని పల్కుచు మోహనరావు తానే రికార్డుతీసి యందు తన చిరునామా తీసికొన్న

తూటాలు వ్రాసి సంతకముచేసెను. ఈలోపున యినస్పెక్టరు తూటాలు తెచ్చియిచ్చి, "రక్షకభటుల యవసరములేదా?" అనెను

"అవసరములేదు" అని పలుకుచు మోహానరావు సుదర్శనమూర్తితో కారులో ప్రవేశించెను మోహానరావు సంజ్ఞ గ్రహించి చతురుండగు యా డ్రయివరు కారును నడపెను. కారు శరవేగమునం బోవుచుండెను. కారు వాల్టేరుసమీపించు సరికి వారి కనతి దూరములో నొకకారు పోవుచుండుట గోచరించెను. డ్రయివ రుత్సాహముతో కారును మరింతవేగముగ నడిపి యచిరకాలములో ముందుపోవుచున్న కారును పట్టుకొనిరి. ఆశ్చర్యము! అందు నారాయణ రామనాధులు సామాన్య వేషములతో సరోజనిని త్రాళ్లతో బంధించి గైకొని పోవుచుండిరి. వారింగాంచినంతనే మోహానరావు రుద్రాకారుడై, "దుర్మార్గులారా? మిము రక్షింప వలయునని మే మాలోచించుచుండ మాకొంపకే నిప్పుపెట్ట నెంచితిరా?" అని యరచెను.

నారాయణ రామనాధులు పారిపోవలయునని తలంచిరి. కాని దండధరసదృశుండగు మోహానుని కరమున నున్న పిస్తోలు వారిని కదలనీయలేదు. సుదర్శనమూర్తి మోహానరావు కనుసన్నపై సరోజనిని బంధించిన త్రాడును విప్పి దానితో నాయిరువుర బంధించెను. మోహానరావు వారిరువురను వాల్టేరు పోలీసుస్టేషనునకుం గొనిపోయి యినస్పెక్టరునకు నప్పగించెను. వారెక్కివచ్చిన కారుకూడ స్టేషనులో నప్పగించి యినస్పెక్టరు వారివల్ల రశీదుపొంది మోహానరావే సరోజనీసుదర్శనమూర్తులతో కారులో కూర్చుండెను. డ్రయివరు మెల్లగ కారును నడుపుచుండెను.

బజారుచేరినంత మోహానరావు డ్రయివరు నుద్దేశించి, "నీపేరేమి? అనెను. డ్రయివరు వెనుదిరిగి చూడకయే "రంగారావు"

అనెను. మోహనరా వాలోచనానిమగ్నుడయ్యెను. రంగారావొక ర
గంట నాతని యాశ్చర్యమును గమనించి, "ఏ మట్లాశ్చర్య పడెదరు?"
అనెను.

రంగారావు వెనుదిరిగి చూచెను. తోడనే మోహనరావు
"ఓహో! మీరా, ఇచ్చటి కెట్లువచ్చిరి?" అనెను.

"నాస్వగ్రామమిదే ఆప్రక్క వీధినే మాయిల్లు. మీఫోను
వచ్చుసరికి నేను డి. యస్. పి. దొరగారితో మాటలాడుచుంటిని.
దొరగారి ప్రియావరుకు జ్వరముగా నుండుటచే నేను కారు తీసుక
వెళ్ళెదనని వారితో చెప్పి బయలుదేరితిని. సరోజనీదేవిగారూ! నన్ను
గుర్తించితిరా? నాప్రార్థన మంగీకరించి మీదంప — "

మోహనరావు తెల్లబోయెను. సరోజని సిగ్గున దలవంచు
కొనెను. సువర్ణమూర్తి చిరునవ్వుతో, "రంగారావుగారూ! భగ
వంతుడు మీకలలు సార్థక మొనర్చునుగాక!" అనెను.

"ఏమి? మోహనరావుగారూ! నాతప్పును మన్నింతురుగాక!
నాడువాల్తేరు స్టేషనులో మీ యుభయులను చూచినప్పటినుండియు
నేనీ యభిప్రాయముతోనే యుంటిని దయయుంచి మీరందఱొక
పరి మాయింట నించుక యల్పాహారము స్వీకరింప ప్రార్థన."

"రంగారావుగారూ! మీయభీష్ట మెట్లో యట్లే కానిండు."
అని మోహనరావు పల్కినంత రంగారావు కారును తనయింటివద్ద
నాపెను. అందరును లోనికి ప్రవేశించిరి. రంగారావు వారి కందఱకును
యుచితాసనముల నొసంగి తన శక్త్యానుసారము ఫలహారము లొసంగెను
అందరును ఫలహారములు గైకొని టీ తీసుకొనిరి. అప్పటికే సాయం
కాల మగుటచే వారందరును బయలుదేరి కారుపై విశాఖపట్టణము
చేరిరి. మోహనరావు యినస్పెక్టరుగారికి జరిగిన దంతయు నివేదించి,
డి. యస్. పి. దొరగారి బంగాళా చేరిరి. దొరగారితో తన యుద్యోగము

తాము విడలిన యగత్యకార్య పరిసమాప్తినెరింగించి యాతని యనుజ్ఞపై సరోజిని సుదర్శనమూర్తులతో నొక గుఱ్ఱపుబండి నెక్కి రంగారావుగారివద్ద సెలవు గైకొని యిల్లుచేరిరి.

---

# పదునాఱవ ప్రకరణము.



మాధవరావు క్రమక్రమంబుగ డోలాందోళిత హృదయుండై యవశత్వము నందుచుండెను. ఆమూర్తి పరితాపము, తనయుని పట్టుదల, సంఘుచట్టములు యివన్నియు చేరి నాతనిని పిచ్చివానిగ నొనర్చుచుండెను. సుదర్శనమూర్తి తన ప్రతిజ్ఞ నెరవేరునరకును విశాఖపట్టణముగ వదలఁ దలంచుకొనలేదు. అతఁడు వచ్చి యిప్పటికి రెండుమాసము లయ్యెను. మరల్నొకనెల సెలవుకై వ్రాసెను తండ్రి నెటులైన నొప్పింపవచ్చునుగాని సరోజిని ప్రాయమువాటిదియని యెరింగినచో నామెను చేఁబట్ట మోహనరా నంగీకరింప డేమోయని భయపడు చుండెను.

ఒకనాఁ డాతఁడేమియు దోచక సముద్రతీరమునకు బోయెను. సుదర్శనమూర్తి యచట కిరుగుసరికే సూర్యాస్తమయము గావచ్చెను అయినను వెన్నెలరాత్రి యగుటచే నాత డచ్చటనే కూర్చుండి యేమియో దీర్ఘముగ నాలోచింప దొడంగెను. అతని కనతిదూరమున లోనే యొకరాతిపై నిరువురు పురుషులు కూర్చుండి యేమియో ముచ్చటించు కొనుచుండిరి సుదర్శనమూర్తి దృష్టి వారిపై బడెను. వారిని తిలకించినంతనే నాతని హృదయమున నేలనో యనుమాన

ముదయించెను. వారేదియో మహత్తరవిషయమునుగూర్చి యూచ్చ టించుకొనుచుండి యుందురని యాతనికి దోచెను. ఆతని హృదయమున నాయభిప్రాయము తోచినంతనే యాతఁడు మెలమెల్లన నడుగు లిడుచు వారిని సమీపించెను. వారిసంభాషణము వినబడుట కవకాశముగ నుండుస్థలమున నాతఁడు దాగి వారిమాటలు వినుచుండెను. వారిట్లు మాటలాడుకొనుచుండిరి.

ఒకడు:—వీడెచ్చట దాపురించెనో మనకు? అన్నిప్రయత్నములలోను గూడ వద్దుతగులుచున్నాడు.

రెండవ:—వాడు చాలదిట్టరి. అదేమిచిత్రమో పోలీసుయినస్పెక్టరుగూడ నాతనికి వంగివంగి సలాము లాచరించుచుండును.

ఒకడు:—అదంతయు డబ్బులో నున్నది. తినమఱిగినవారు గౌరవించుటొక గొప్పయా?

రెండవ:— నాకదియు యదార్థమని తోచదు. ఆతఁడు ధనవంతుఁడను విషయము నేను నమ్మను.

ఒకడు:—కాని యాతఁడు మొన్న సరోజనిని రక్షించుట నిజముగ నామెయందలి ప్రేమ వలననే యందువా?

రెండవ:—సందేహమేల? ఆవిషయమున నేనొకానొక సమయమున నాయిరువు వలననుగూడ వినియుంటిని.

ఆపలుకులు చెవుల సోకినంత సుదర్శనమూర్తి హృదయము సంతోష పూరితమయ్యెను. ఆతనికిఁ గావలసిన దదియొక్కటియే. ఆ రహస్యభేదనమునకే యాతని మనమింత యారాటము నందసాగెను.

ఇఁక నాతఁడు వారి విషయమేమియు పరికింపఁ దలంపలేదు వెంటనే బయలుదేరి స్వగృహముఁ జేరుకొనెను. సరోజని యాతని కొఱకు భోజనమైన గావింపక నిరీక్షించుచుండెను. సుదర్శనమూర్తి వచ్చినతోడనే యామె కుులేచి యిరువురును భోజనముల శాలలోనికి

పోయిరి. వంటబ్రాహ్మణుఁడు వారిరువురకును భోజనము వడ్డించెను. ఇరువురును భుజించుట ప్రారంభించిరి.

సుద:—సరోజనీ! నీవు చెప్పకపోయినను నేను తెలిసికొంటిని.

సరో:—ఏమది?

సుద:—సరోజనీ! నాకడ నీకు భయమెందులకు? నీయభిలాష యెట్టిదియైనను తీర్చెదనని చెప్పియుంటినిగదా! అట్టిచో నీవు మోహనరావును ప్రేమించిన సంగతి నాతో నేల చెప్పలేదు?

సరోజని సిగ్గునఁ దలవంచుకొనెను. ఆమె హృదయము తడతడ కొట్టుకొనసాఁగెను. అన్న కోపించునేమోయని భీతిల్లసాఁగెను.

సుద:—సరోజనీ! నిశ్చింతగనుండుము. నీకు శుభవార్త చెప్పెదను. ఆతఁడుకూడ నీయెడ సంపూర్ణబద్ధానురాగుఁడై యున్నట్లు తెలిసెను.

సరోజని ముఖము వికసించెను. ఆమె యొకపరి మోమెత్తి సుదర్శనమూర్తిని దిలకించెను. "అన్నా! నిజమేనా?" యను మాట లామె నోటినుండి వెలువడెను. అంతలో నామె పనపిఁ గంచుకొని యామె యాతురత కామె తనలోఁ దానిందించుకొనెను.

సుద:—నిజమే సరోజనీ! నీ వదృష్టవంతురాలవు.

సరోజని మాటాడలేదు. ఇరువురును భోజనములు ముగించి సావడిలోనికివచ్చిరి. సేవకుఁడొకఁడు సుదర్శనమూర్తి యాజ్ఞప్రకారము సావడిలో నాతనికి పక్క వైచెను. అదిచూచి సరోజని తనకుఁగూడ సావడిలోనే శయ్య నమర్చుమని సేవకునకుఁ జెప్పి తనగదిలోనికిఁ బోయి పుస్తకము చదువుకొనుచుండెను. సుదర్శనమూర్తి సావడిలో పరుండెను.

రాత్రి పదిగంటలయినది. అక్కడక్కడ జనసంచారము మిఁచుమించుగయున్నను మొత్తముమీఁద సందడి తగ్గినదనియే చెప్పవచ్చును సరోజని యింకను తనగదిలో కూర్చుండి చదువుకొనుచునే యుండెను. ఆగదికి ప్రక్కసందులోని కొక కిటికీగలదు. గాలికొఱకు సరోజని

యాకిటికీని తెరచి యుంచుకొనెను. ఆగవాక్షముగుండా చల్లని మంద మారుతము వచ్చుచుండెను. బయటనుండి చంద్రకాంతి ప్రకాశ మానమున వెలుంగుచు లోనికిఁగూడ వచ్చుచుండెను.

సరోజని కొంతవరకు చదివి పిమ్మట గవాక్షముగుండా యెదుట నున్న గోడపైపు చూడదొడంగెను. ఆచూపులకు లక్ష్యములేదు. ఏదియో యాలోచించు చున్నట్లు చూపరు లూహింతురుగాని నిజముగ నామె కేయాలోచనయులేదు ఆమె యక్షుల నిశ్చలముగ చూచు చున్నదో యామెకే తెలియదు. గడియారము పదునొకండు గంటలు కొట్టెను గాని యాగంటలు సరోజని కర్ణపుటంబుల బ్రవేశింపలేదు. ఆమె యింకను నట్లే చూచుచున్నది. మొగమున నేవిధమైన మార్పును గోచరించుటలేదు. అయ్యది వెనుకటివలెనే నిర్మలమై యుండెను.

ఆకస్మికముగ నామెదృష్టి యామె కెదుటనున్న బల్లపై పడెను. దృష్టితోపాటు మనసంతయు నాస్థానమున లగ్నమయ్యెను ఆబల్లమీద నామె నంతగ నాకర్షింప గల్గిన వింతపదార్థ మేమున్నది? ఉన్నది. అకారణముగ నామెదృష్టి మరలదు. ఆబల్లమీద నొక లేఖయున్నది. ఆలేఖ గవాక్షమార్గమున నెవ్వరిచేతనో విసరఁబడియెను. సరోజని చటాలున లేచి యాబల్లపైనున్న లేఖ యందుకొనెను అది యొక కవరు. దానిపై "మిస్. సరోజనిదేవి" అని వ్రాయఁబడియున్నది ఆమె దీపపువెలుగున నాయక్షరములను స్పష్టముగ చూచెను. ఆమె నామాక్షరదర్శన మాత్రమె కే భీతి గొలుపుచుండెను. కవరు చేతబట్టుకొని చించవలెనని యత్నించుచుండెను గాని భీతిచే నామె కరము లామె యాజ్ఞను పాలింపలేదు. ఎట్టకేలకు మది కుదుర్చుపఱచుకొని యామె కవరుచించి యందులోని లేఖఁ బయటకుఁ దీసెను అందిట్లుండెను

" సరోజనీ!

నీ వెవ్వరిని ప్రేమించి యెవ్వఁడు నిన్ను సౌఖ్యవారాసి నోల లాడించి యానంద మొసంగునని తలంచుచుంటివో యామోహనరావు మిత్రుఁడగు శ్రీనివాసుని సమేతమున వంటింటజొచ్చు కిటికీ చందంబున నాభవనమునఁ బ్రవేశించి నాచే బంధితులైన విషయమింకను నీకుఁ దెలసియుండదు. ఇపుడు నిన్ను రక్షించువా రెవరునులేరు. అచిరకాలములోనే నీవు నా స్వాధీన మయ్యెదవని యుందుమూలముగ నీ కెరిఁగించుచున్నాను.

ఇట్లు,

నీ ప్రేమకాంక్షి "

ఆ లేఖ యామెకు భయాశ్చర్య విచారము లొక్కుమ్మడిఁ గల్గించెను. ఆమె చేతిలోనుండి లేఖజారి క్రిందఁ బడిపోయెను. ఆపాద మస్తకమును కంపింపఁదొడంగెను. కెవ్వునయొక్క కేకవైచి ప్రక్కనేయున్న మంచముపైఁ బడిపోయెను.

నిద్రాముద్రితుండై యున్న సుదర్శనమూర్తి నాకేక మేలుకొలిపి అతఁడులికిపడిలేచి' " సరోజనీ! " యని పిలచెను. సావసిలో నామె కొరకమర్చబడిన శయ్యపై నామెలేదు. వెంటనే యాతని దృష్టి సరోజని గదివైపు ప్రసరింపజేసెను. గదిలో దీపము వెలుగుచున్నది. వెంటనే యాతఁడు లేచి సరోజనిగదిలోనికి పరువెత్తెను. మంచముపై విచారాక్రాంతవదనయై, నిమీలిత లోచనయై పరుండిన సరోజనిని గాంచెను. తక్షణమాతఁడామెను సమీపించి పిలచెను. ఆమె కనులు దెరచిచూచి చటాలున నాతని కంఠమునకు తనబాహువులు పెనవైచి బోరుననేడ్వసాఁగెను. అతఁడేమియు దెలియమి తబ్బిబ్బుపడుచు కారణ మరయ యత్నించెను. కాని యామె యేమియుఁ జెప్పలేదు.

కొంతవడికి సుదర్శనమూర్తి సరోజని చేతులలోనుండి జారి క్రిందపడిన కాగితము తీసి చదివెను. అతనికిగూడ విచారాశ్చర్యములు

గళించినవిగాని ధైర్యము చెదరలేదు. :" సరోజనీ! విచారించిన నేమి ప్రయోజనము? ధైర్యంబున నిందుండకుండగిన ప్రతిక్రియయూహించి యీదురాత్ముల బంధింపవలయును. " అనెను.

ఆపలుకు లామెకు ధైర్యము కల్గించినవి. ఆమెకు మొదట నుద యించిన విచారాశ్చర్యములిప్పుడు రౌద్రముగ మారిపోయినవి. ఆమె పండ్లు పటపట గొరుకుచు, " ఓరీ! దుర్మార్గా! నన్ను స్వాధీనముగావిం చుకొందువా? కానిమ్ము. నిన్ను యీముని సదనంబున నాతనియనుచరుల స్వాధీనమొనర్పకున్న నేను సరోజనినేగాను. అన్నా! నీవునాకు పురుష దుస్తులునొసంగుము. నేనిప్పుడే స్టేషనునకుంబోయి మోహనరావుగారు బంధింపఁబడుట దెల్పి వారిసహాయమును విడిపించుకొనివచ్చెదను" అనెను

సుద:—నీవు పంపుచున్నయీమాత్రమున నీ యర్ధరాత్రమున భటులునప్పుట కారక్షకభటాధికారు లనుమతింతురా?

సరో:—నేనేకాదు. పసిపాపయైను వెళ్లి వారికి సంభవించిన దుస్థితినెరింగించిన నాయుద్యోగులందరును నిద్రాహారాదులనైనమాని యీ తని రక్షణకై బయలు దేరుదురు

సుద:—అటులైనా? ఆరేయీ మార్గమునకు క్రొత్తగాదా?

సరో:—కావచ్చును. అప్రశ్నకేమియు నన్నిప్పుడడుగవలదు.

సుద:—సరేలెమ్ము.

సరోజని సుదర్శనుల్వారి గదిలో ప్రవేశించి పురుషవేషము ధరించెను తరువాత యిరువురును బయలుదేరి వాయువేగమును మిం చిన గమనంబున పోలీసుస్టేషనువైపు నడువసాగిరి. అచిరకాలములోనే వారు స్టేషను చేరి యచటనున్న యొకభటుని సహాయమువలన నినస్పె క్టరు గృహముచేరిరి ఆతఁడు నిద్రాముద్రితుఁడై యుండెను. సరోజిని తలుపుతట్టి పిలచెను పోలీసు అధికారి లేచి తలుపుతీసి తనయెదుట నిలువఁబడియున్న నూతనపురుషుని గాంచి నివ్వెరపడి "నీవెవరు" అనెను

సరో:—అయ్యో! అప్రశ్న లేమియు నిప్పుడు వలదు. ముందీ చీటిచూడుడు. దీని నొక వృద్ధుఁడు త్రోసిపోవుచుండ తీసికొంటిని. వానిని బంధింపవలయు ననుకొంటినిగాని యింతలో పారిపోయెను.

పోలీసధికారి యాచీటితీసుకొని చదివి యించుక సందేహింప సాగెను. అతని యనుమానమును తెలసికొని. "ఏమట్లాలోచించెదరు? మీరు వచ్చుటకు భయపడిన మాకు రెండు రివాల్వరుల నొసంగుడు మేమేపోయి వారిని రక్షించి తోడ్కొనివచ్చెదము." అనెను.

అధి:—ఆతఁడెక్కడ బంధింపబడెను?

సరో:—రామలాలు గృహమున.

అధి:—మీరెట్లు చెప్పగలరు?

సరో:—మాకట్టి యనుమానము గలదు.

అధి:-నేనురాను. మీరుకోరిన రివాల్వరు లొసంగెద. నాకురసీదిండు.

సరో:—సందేహమేల? తప్పక యొసంగెద.

అధికారి లోనికరిగి రెండు రివాల్వరులును, ఒక అచ్చుఁరసీదు ఫారమును తీసికొనివచ్చెను. సరోజని రసీదు ఫారమును పూర్తిగావించి దాని క్రింద 'సరోజని. బి. ఏ.' అని యాంగ్లభాషలో సంతకము చేసెను. ఆసంతకముచూచి అధికారి యాశ్చర్యమంది "ఏమీ! నీవు సరోజనివా?" యనెను. సరోజని యామాట వినిపించుకొనకయే రివాల్వరులు తీసికొని సుదర్శనమూర్తిని వెంటఁబెట్టుకొని వెడలిపోయెను

సరోజని వెడలిపోయినపిదప నా యినస్పెక్టరాలోచనా నిమగ్నుడయ్యెను. నిజముగ నా వ్యక్తి సరోజనియేనాయని యాతని బాధింపసాగెను. ఆవ్యక్తి పడుచున్న యాతురతవలన నామె సరోజనియై యుండుట నిశ్చయమని యాతఁడూహింపఁ దొడంగెను. ఎటులైనను వారల నెంబడించుట మంచిదని యూహించి యాతఁడు వేరొక రివాల్వరు గైకొని బయలుదేరెను. ఏ త్వరయమున నడచుచున్నను యాతఁడు ముందుఁబోవుచున్న వారినిమాత్రము కలసికొనలేకపోయెను

క్రమముగనాతఁడు కామలాలు గృహము ప్రవేశించెను. తలుపు లన్నియు తెరువబడియున్నవి. ఇనస్పెక్టరు సావడిలోనికి వచ్చిచూచెను తనయింటికి వచ్చిన యిరువురు వ్యక్తులలో సరోజని చేత రివాల్వరుఁ బట్టుకొని పదిమంది మనుజుల నడ్డుకొనుచుండెను. రెండవవ్యక్తి యొక మూల దెబ్బతిని పడిపోయెను. ఆదృశ్యమునుగాంచి చటాలున నాతఁడు సరోజనిని సమీపించెను. తన చేతనున్న రివాల్వరుతో నిరువురను గాల్చెను. మిగిలినవారు పారి పోయిరి.

సరోజని అన్నను సమీపించెను. ఆతనికంత బలమైన గాయము తగులకపోయినను యెన్నఁడును దెబ్బ తినినవాఁడు కాకపోవుటచే క్రింద పడిపోయెను. సరోజని యాతని దెబ్బకు కట్టుకట్టెను. తరువాత నామె యినస్పెక్టరును సమీపించి, " అయ్యా! దయయుంచి మీ రీతనికడ నుండుడు. నేనులోనికిబోయి మోహనరావుగారిజాడలరసివచ్చెద" ననెను

# పదునేడవ ప్రకరణము.



మోహనరావు తానా యభియోగమున పనిచేయు చున్నట్లె వ్వరు నెఱుంగరాదని యాతని యభిప్రాయము. కాని యయ్యది యవ్వా డాతనికి మనోవైకల్యముఁ గలిగించినది. రెండుమూడు దినములలో శ్రీనివాసరావుయొక్క యపహృత పత్రములు గొనివచ్చి యాతని యధీన మొనర్పవలయుననియు, నంతవరకు ముఖ మెవ్వరికిని చూప రాదనియు నిశ్చయించుకొనెను. ఆనాఁడు మధ్యాహ్నము నాల్గుగంటల వరకాతఁడు యథారీతిగనే శ్రీనివాసరావుతో ముచ్చట లాడుచు కాలము గడపెను. నాల్గుగంటలకు కమల నొసంగిన కాఫీ గైకొని పది నిముసములుపిదప బజారునకు వెళ్ళి వచ్చెదనని యాదంపతులతో చెప్పి వెడలిపోయెను.—

రాత్రి యెనిమిదిగంటలు దాటెను. మోహనరావు తిరిగిరాలేదు శ్రీనివాసరావాందోళనపడజొచ్చెను. మరల వైరులకు చిక్కియుండె నేమోయని యాతని కనుమాన మునయించెను. ఎచ్చట కరిగిన నాతనిఁ జూడఁగలఁడు? మోహనరావేవైపునకు బోయెనో యాతఁడెట్లు తెలసి కొనఁగలఁడు? ఒకమనుజుని స్టేషనునకుబంపెను. తొమ్మిదిగంటల కా మనుజుడు తిరిగివచ్చెను. ఆతనివలనగూడ మోహనునిజాడ తెలియలేదు శ్రీనివాసరావున కేమియు దోచుటలేదు. మధ్యాహ్నము భోజనకాల మున కమల పలికిన పలుకులాతని కలుకఁ గలిగించి యుండునేమోయని యాతఁడు సందేహింపసాగెను. నాటిరాత్రి యాతఁడు భోజనము చేయలేదు. భర్త భుజింపకపోవుటచే కమలకూడ నట్లే యుండిపోయెను. పాపము! తాను పలికిన పలుకులు ములుకులై నాటి మోహనరావును తమ గృహమునకు దూరము గావించెనని యామె యెరుంగదు. కమల నిష్కపటహృదయ ఇట్లు సంభవించునని యామె యూహింపఁగలిగినచో నామాట పలుకకుండెడిది. తానే యిట్టి విపరీతమునకుఁ గారణమని యామె యెరుంగక పోయినను, యామె హృదయమునమాత్ర మొక నిగూఢమగు బాధ యంకురించి యామెను బాధించు చుండెను. ఆబాధయేమో యామెకే తెలియదు.

కాలము జరిగిపోవుచుండెను. పదునొకండు గంటలు కొట్టెను. అరగంట కొట్టుటకు సిద్ధముగనుండెను. లోకమంతయు నిశ్శబ్దము తాండ వించుచుండెను. శ్రీనివాసరావుగృహముకూడ ప్రశాంతముగనే యుం డెను. శ్రీనివాసరావు సావడిలోని పడకకుర్చీలో కూర్చుండెను. కమల యాతని కెదురుగ నొకమూల పరుండి నిద్రించుచుండెను. శ్రీనివాస రావు నిద్రింపవలయునని యత్నించెను గాని యాతని హృదయావేదన మాతనికి నిద్ర పట్టనిచ్చినదికాదు. అట్లే నిలువుగ్రుడ్లువైచికొని కూర్చుండియుండెను.

పండ్రెండుగంటలు కొట్టుట కెంతయో కాలము లేదు. అతఁడు గడియారమువంక చూచుచుండెను. పెద్దముల్లు పదునొకండవ యంకెమీఁదకు వచ్చెను. నిశ్చలదృష్టులతో దీర్ఘాలోచనానిమగ్నుఁడై యున్న యాతనిదృష్టులకు చలనముగలిగి వీధివైపు ప్రసరించెను. హృదయాలోచనమునకు విఘ్నము కలిగించెను. పాఠకులారా! ఇతనియం దాకస్మికముగ నట్టిమార్పు గలుగుటకు కారణ మేమో యూహింపఁగలరా? శ్రద్ధగ నాలకింపుఁడు. వీధితలుపును మెల్లగ నెవరో తట్టుచుండిరి.

శ్రీనివాసరావు కుర్చీనుండి లేచి మెల్లగ వీధితలుపు తెరచెను. అంతవఱకును మోహనరావు తిరిగి వచ్చియుండెనని యాతఁ డుత్సాహపూరితుఁడయ్యెను గాని యాతని యుత్సాహమునకు భంగము గలిగినది. ద్వారముకడ సరోజని నిలువబడి యుండెను. సావడిలోని దీపకాంతులామెపై ప్రసరించుచున్నవి. వెలుఁగున నామెముఖము మేఘాచ్ఛన్నమగు చంద్రబింబమువలె కళావిహీనమై యుండెను. ఆమె హస్తమున నొక కాగితము మాత్ర ముండెను. ఆ నిశాసమయమున సరోజనిరాక యాతని కాశ్చర్యము కలిగించెనుట వింతగా నేరదు.

" సరోజనీ! లోపలికిరమ్ము. ఇదేమింత యర్ధరాత్రమున వచ్చితివి "

సరోజని మాటాడకుండగనే లోనప్రవేశించెను. శ్రీనివాసరావు ద్వారమును బంధించి, సరోజని వెనుకనే సావడిలోనికి వచ్చెను. ఇరువురును చెఱియొకకుర్చీపై నాసీనులైరి. పిదప వారిట్లు సంభాషింపసాగిరి

శ్రీని:—సరోజనీ! ఏమీయుత్తరము?

సరో:—చూడుము. చూచిన నీకే బోధపడఁగలదు.

శ్రీని:—ఎవరు వ్రాసిరి?

అని పలుకుచు సద్దాని నందికొని దీపపు వెలుఁగున నిట్లు చదువసాగెను.

" సరోజని!

లోకులందరును నేను సుఖముగ శ్రీనివాసరావుగారి గృహమున విందులఁ గుడుపుచు నాతని కేమియు నుపకారమొనర్ప యత్నించుట

లేదని చెప్పుకొనుచుండిరి. ఆపల్కులు వినుటకు నాకు చాలకష్టముగ నుండెను. ఈదినముననే నేను కృతనిశ్చయుఁడనైతిని. శ్రీనివాసరావు యొక్క పత్రమును గొనివచ్చువరకు నాముఖము నెవ్వరికిని చూపఁ దలపలేదు నాకొరకు నీవెంతమాత్రమును చింతింపవలదు. నాలుగు రోజులలో పత్రములతో నన్నుగాని, లేక నా మృతకళేబరముగాని గాంచెదరు. ఇదియే నానిశ్చయము.— ఇట్లు,

మోహనరావు. "

ఆలేఖ చదువుచున్నప్పుడు శ్రీనివాసరావు నేత్రములవెంట నశ్రుజలము అమితముగ గారుచుండెను.

" సరోజనీ! యింత యనర్థమునకు నేనే కారణము. అక్కటా! పాడుద్రవ్యమున కాశించి ప్రాణసమానుఁడగు మిత్రుని మనము నొప్పించితిని. ఛీ! ఛీ! నాజీవితము వ్యర్థము? సరోజనీ! నాయకృత్యమువలన నెన్నిజీవులు సంతాపము నొందుచుండెనో? "

" శ్రీనివాస్! దుఃఖించిన లాభమేమి? గడచినదేదో గడచినది ఇప్పుడు కర్తవ్యమూహింపుము. "

" సరోజనీ! విచారభారమున నామనసు కుదురుటలేదు. నీవే యాలోచించి నన్నేమి చేయుమందువో యెఱిఁగింపుము. "

" మానమిపు డాతనికి సహాయము చేయవలయును. "

" నేను సిద్ధముగ నున్నాను. "

" అయిన నాతోరమ్ము. " అని పలుకుచు సరోజని లేచెను.

" నిరాయుధులమై బయలుదేరి మనమేమి చేయఁగలము? "

" నిరాయుధులమా! ఇవిగో రివాల్వరులు. " అని పలుకుచు నామె చట్టలో దాచియుంచిన రివాల్వరులు బయటకుతీసి యందొక దానిని శ్రీనివాసరావున కొసంగెను. ఆరివాల్వరులు రెండును పూర్తిగ గుండ్లచే నింపబడియున్నవి. శ్రీనివాసరావు సరోజని సాహసమునకును, జాగ్రత్తకును సంతసించెను.—

తరువాత శ్రీనివాసరావు కమలను లేపి, "కమలా! మేమొక కార్యార్థమై వెళ్ళుచున్నాము. తలుపు వేసికొనుము" అని మాత్రము చెప్పి, సరోజినితో బయలుదేరెను.

అర్ధరాత్రము-నిశాకాంత సంపూర్ణ ప్రభావముతో తాండవించుచుండెను. చీకటి నలుదట్ల నల్లుకొనెను. ఆగంభీర తమోమధంబున సరోజని శ్రీనివాసరావులు నడచి పోవుచుండిరి. వారిరువుర దృష్టులన్నియు రామలాలు భవనమువైపున కుండెను.

వేగగమనంబున వారచిరకాలములో లాలు గృహమును చేరుకొనిరి. సరోజనీ శ్రీనివాసులా భవనము చుట్టును దిరిగిచూచిరి. ద్వారములన్నియు బంధింపబడియేయుండెను గాని సావడిలోనుండి వీధిలోనికి గల కిటికీమాత్రము తెరువఁబడి యుండెను. సరోజని కిటికీగుండా లోనికి చూచెను. నాఁడు తన్ను మోసగించి సముద్రతీరమునకు దీసికొనిపోయిన వృద్ధుఁడు సావడిలోఁగల పెట్టెలోని కాగితముల తిరుగవేయుచుండెను. ఆతని జూచినంతనే సరోజని వొడలు మండిపోయెను. ఆతనిని వెంటనే తనచేతిలోనున్న రివాల్వరుతో కాల్చివేయ వలయునని యూహించెను. గాని యట్లొనర్చిన తనముందు కార్యమునకు భంగము కలుగునేమోయని శంకించి యూరకుండెను. మరల నొకపరి భవనము వెనుకవైపునకుబోయి చూచెను. మేడమీదనుండి యొకత్రాడు వ్రేలాడుచున్నది. ఆత్రాడువద్ద నొక వృద్ధుడు నిలువఁబడి త్రాటిని పరిశీలించుచుండెను. చీకటిగ నుండుటచే సరోజని యాతనిని సరిగ పోల్చుకొనలేక పోయెను. అట్లే నిలువబడి యాతని కృత్యముల దిలకించుచుండెను.

ఆవృద్ధుఁడు మెల్లగ నాత్రాటిసహాయమున మేడపైకెగబ్రాకుచుండెను. ఆతఁడు మేడపైకి పోయినపిదప నాత్రాటిని తీసివేయకున్న తానుఁగూడ గవనములో బ్రవేశించుటకుఁ దగిన యుపాయము కలిగినదని యామె సంతసించెను. ఆమె తలంచినట్లే యాతఁడు త్రాటి నచే

యుంచి లోన ప్రవేశించెను. సరోజని శ్రీనివాసరావును పిలచి యాత్రాడును సమీపించెను. ఆత్రాటికి మధ్య ముడులు వేయఁబడి యుండుటచే వారిరువురును సునాయాసముగ మేడపైకి చేరికొనిరి. మొదట వారు లాలు నిదురించుచున్న గదిని సమీపించి చూచిరి. ఆగదితలుపు తెరువఁబడియే యుండెను. లోన లాలు సుఖనిద్ర నందుచుండెను. సరోజని మెల్లగ నాతలుపులుమూసి బయట బంధించెను. తరువాత శ్రీనివాసరావుతో కలసి యామె మేడమెట్లు దిగి క్రిందికి వచ్చెను. సావడిలో నిరువురు వ్యక్తులు దెబ్బలాడుకొనుచుండిరి. ఇరువురును వృద్ధులే. ఇరువురకును గడ్డములున్నవి. వారిరువురఁగాంచి సరోజని చకితయయ్యెను. ఆమె వెంటనే వారిలో నొకఁడు తన్ను మోసగించిన వృద్ధుడనియు, రెండవవాఁడు మోహనరావై యుండవచ్చుననియు యూహింపగలిగెను. కాని యందెవరెవరో నిర్ణయింపఁజాలమి యామె యేమిచేయుటకును వీలులేక యట్లే నిలుచఁబడి యుండెను.

పోరు ఘోరమయ్యెను. తుదకందొకవ్యక్తి రెండవవానిని పిడికిట నొకపోటు వక్షముపై పొడిచెను. ఆదెబ్బ కాతఁడు తాళలేక యొక కేకవైచి నేలకూలెను. వెంటనే రెండవయాతఁ డాతని ప్రక్కనున్న త్రాటిచే కాలుసేతులు బంధించి మేడమెట్లవైపు చూచెను ఎదుట నిలువబడిన సరోజనినిచూచి యాశ్చర్యచకితుఁడయ్యెను. “సరోజనీ” యని యొక్క కేకవైచెను.

ఆకంఠము చిరపరిచయమైనది. శ్రీనివాసరా వాశ్చర్యమంది యట్లే నిలచిపోయెను. సరోజని మాత్రము, “మోహన... .....” అని పలుకుచు చటాలున నాతని కౌగలించుకొనెను. ఆహా! ఆసమయమున వారనుభవించిన యానందము వర్ణనాతీతము. అంతవఱకెన్నఁడును దృశ్యాలింగనమేగాని శారీరాలింగన భాగ్యము వారిరువురును గూడ బొందియుండలేదు.

పదినిముసములు వారిరువురు నిమీలితలోచనులై యట్లే నిలువ డిపోయిరి. శ్రీనివాసుని పిలుపు వారికి చైతన్యము కలిగించినది.

"మోహనరావూ! అకారణముగ కమల నీమనసు నొప్పించినది. ందుల కామెకు మారు నేను నిన్ను క్షమార్పణ వేడుకొనుచున్నాను. ాకు పత్రమువలదు. ఇంటికిరమ్ము." అని శ్రీనివాసరావు మోహనుని రెండుచేతులు పట్టుకొని బ్రతిమాలసాగెను.

మోహనరావు చిరునవ్వుతో "శ్రీనివాస్! ఇది నావిధికృత్యము ప్రభుత్వమువారు నాకు నెలకయిదువందల రూప్యము లిచ్చుచున్నారు. ాపని ప్రజోపకారము. ఇదిగో ప్రభుత్వమువారు నాకొసంగిన బిరుదు." అని పలుకుచు తనచొక్కాను ప్రక్కకు తొలగించెను. లోన "గవర్నమెంటు సి. ఐ. డి." అని యాంగ్లభాషలో చెక్కబడిన లోహపుబిళ్ళ యుండెను. దానిచూచి శ్రీనివాసరా వాశ్చర్యమందెను.

"రమ్ము పైకిపోయి లాలును బంధింతము."

మేడ వకీనడిగనెక్కి లాలుపరుండిన గదితలుపు తెరచిరి. ఆశ్చర్యము లాలులేడు. మోహనరావు రివ్వున వెనుదిరిగి డాబామీదకువచ్చి నలు వైపుల పరికించెను. భవనమునకు కొంచెముదూరములో నొకవ్యక్తి పారిపోవుచుండుట చూచెను. ఆతఁడు నిలువబడినచోటనుండియే త్రాడు క్రిందకు వ్రేలాడుచున్నది. మోహనరావు వెంటనే త్రాటిసహాయమున క్రిందకుదిగి యాతని వెంబడించెను. కాని గలసికొనలేకపోయెను.

ఎట్టకేలకు ప్రాణము విసవి మోహనరావు తనచేతనున్న పిస్తోలు తో లాలును కాల్చెను. ఆదెబ్బ యాతని కుడికాలిపై గాఢముగా తగి లెను. దానితో నాతఁడు క్రిందపడిపోయెను. మోహనరావు వాని నట బంధించెను. అప్పటికి నాల్గుగంటలయ్యెను.

"సరోజనీ నీవుఇనస్పెక్టరుగారి యింటికరిగి యిచటజరిగిన సంగతు లన్నియు దెలిపి నలువురు రక్షకభటులతో నాతని దోడ్కొని రావలెను"

అయిదుగంటలగుసరికి ఇనస్పెక్టరుగారిని, నలుగురు రక్షకభటులను కారులో తీసుకువచ్చెను.

మోహనరావు యాజ్ఞపై వారు బంధితులైన వృద్ధుని రామలాలును మోసుకపోయి కారులో పడవైచిరి మిగిలినవారు స్టేషనునకు చేరిరి. అట నాచోరుల కారాగృహంబున బంధించి వారిండ్లకరిగిరి.

---

## ఉపసంహారము.

మరునాడు న్యాయస్థానమున బంధితుల విచారణ ప్రారంభమయ్యెను. కోర్టంతయు ప్రేక్షకులచే నిండియుండెను మోహనరావభియోగ వృత్తాంత మెరింగించి కూరుచుండెను.

న్యాయాధిపతి యాజ్ఞపై రామలాలిట్లు చెప్పదొడంగెను.

" ధర్మప్రభువులనందగు న్యాయాధికారుల యెదుట నేను నా నిజచరిత్రమును వెల్లడించుచున్నాను. నేనును, శ్రీనివాసరావు దత్తత జనకుండును అన్నదమ్ముల బిడ్డలము. మాపిత్రియమైన యాస్థియంతయు మాతండ్రి పాడుచేయుటచే మాదీనస్థితిగాంచి యాతడు మాకు కొంతయాస్థి నొసంగెను. ఆయాస్థిని యాతని మరణకాలమున నే నతిదీనముగ నడుగుచు నాతనిం బ్రార్థించితి. అతడు దయాస్వాంతుడై యీ యాస్థి నాతని కుమారుడగు శ్రీనివాసరావునకు నాతని ఇరువది ఐదవయేట నాతనిస్వాధీన మొనర్చునట్లు నాచే ఎగ్రిమెంటు వ్రాయించుకొని యాస్థిని నాస్వాధీనము గావించెను. ఆతని మరణానంతరమునం గూడ రెండుమూడు సంవత్సరములవఱకును చిన్నవాడగుటచే శ్రీనివాసరావును కనిపెట్టుకొని యుంటిని. రానురాను నానిష్కపట హృదయము నాశాంకరము బయదేరి నానాటికివృద్ధికాజొచ్చెను. మేమనుభవించుచున్న శ్రీనివాసరావుయాస్థిపై సంవత్సరమున కేబదివే లాదాయము వచ్చును. అంత విలువగల యాస్థిని తిరుగ వాని వశమొనర్చి

ధనవంతుఁడని పేరొందిన నేను నిరుపేద నగుటకు నామన మంగీకరింప దయ్యెను. నాహృదయోద్దేశమునకుఁదోడు కారాగారమున విషముతిని మరణించిన వృద్ధుఁడుగూడ నాయుద్దేశమును బలపరుప దొడంగెను కాని నేను నాస్వహస్తములతో శ్రీనివాసరావుతండ్రికి వ్రాసియిచ్చిన ఎగ్రిమెంటు ననుసరించి నేనాతనియాస్తి నిప్పుడాతని స్వాధీన మొనర్పకున్న నాతఁడా పత్రసహాయమున నను రచ్చకీడ్పించి తనయాస్తి తాను స్వీకరించుట నిక్కువము. అందుచే నావృద్ధునితో నాలోచించి పత్రమును సంగ్రహింప వలయునని నిశ్చయించుకొంటిమి. తరువాత నాకగత్యమైన పనియుండుటచే కాకినాడ వెళ్ళవలసివచ్చెను. నేను కాకినాడలో నుండగనే శ్రీనివాసరావున కస్వస్థతగ నున్నదని యీ మోహనరావు గారికి తంతి వచ్చినది. నాపత్ర సంగ్రహణమునకుఁగూడ నదియే యదనని తలంచి నేనుగూడ మోహనరావు బయలుదేరిన దినముననే బయలుదేరితిని. ఇచ్చటకు వచ్చినప్పటినుండియు నాపత్రమును దొంగిలించుటకు ప్రయత్నించితిని కాని మోహనరావు శతసహస్రనయనములతో జబ్బుస్థితిలోనున్న శ్రీనివాసుని యాతని గృహమును సంరక్షించుచుండుటచేత నా ప్రయత్నము విఫలమయ్యెను. శ్రీనివాసునకు శరీరవ్యాధి నివారణమై యారోగ్యము కలిగినంతనే మోహనరావు శ్రీనివాసుని గృహపరిస్థితులయందు మునుపు తాను వహించినంత శ్రద్ధ వహించుట మానివేయుటచే నా సమయమున నొకనాటి యర్ధరాత్రి నేనును యావృద్ధుడును కలసి శ్రీనివాసునియింటఁ బ్రవేశించి పత్రములు రెండువేలు రొక్కమును సంగ్రహించితిమి. సామర్లకోటనుండి వాల్తేరు చేరినతోడనే రంగారావీతనికి వినయముగ నమస్కరించుట, తనకారు సప్లయిచేయుట వీనినన్నిటిని చూచి మోహనరావునకు పోలీసు ఉద్యోగులతో స్నేహమని మాత్రమే గ్రహించితిని గాని యాతఁడపరాధ పరిశోధకుఁడని నే నెఱుంగను. నిన్న మోహనరావుతో మల్ల[illegible]ద్ధ

మునరుద్యోగవస్త్రం డాతఁ డాధరించిన మెటలుబాడ్జి(Matal Badge)చూచి తెలిసికొంటిని. శ్రీనివాసరా వెన్నడును తనపదవికిందగిన దుస్తుల ధరించియుండలేదు. ఉద్యోగోచితవేషంబున నాతనిఁ జూచుటిదియే మొదటిసారి. ఇదియే నాజీవితచరిత్రము. ”

న్యాయాధికారి చెప్పినదంతయు వ్రాసికొని దానిపై రామలాలు నామమున వ్యవహరింపఁబడుచున్న సర్వేశ్వరరావుచే సంతకముచేయించెను. తరువాత క్రముముగ నారాయణ రామనాథములు విచారింపబడి తాము ధనాశచేత సర్వేశ్వరరావున కుపకార మొనర్చుచు ప్రభుద్రోహమునకుఁ బాల్పడినట్లంగీకరించిరి. న్యాయాధిపతి ఆనాఁడే యా వాఙ్మూలములు ప్రకారం వారివారికి క్రమప్రకారము విధింపవలసిన శిక్షలు విధించెను.

విచారణ ముగిసినపిదప శ్రీనివాస మోహనరావులును, సుదర్శనమూర్తి మాధవరావులును శ్రీనివాసరావు గృహమున వారందరు సర్వేశ్వరరావు దుండగములను నారాయణ రామనాథుల సాహసమును గూర్చియు ముచ్చటించుకొనిరి. కొంతసేపయినపిమ్మట శ్రీనివాసరావు “ మాధవరావుగారూ! పరాత్పరుని దయవలన-యీ మోహనరావు సహాయమువలన మనము విజయమందితిమి. మీకుమార్తె సరోజిని వివాహవిషయమే మాలోచించితిరి?

మాధవరావు మరల నాలోచనా పరవశుఁడయ్యెను. కుమారునివద్ద నిమిషమున కొకవిధమునఁజెప్పి తప్పించుకొనెను. ఒకవంక సంఘుచట్టములును, వేరొకవంక పుత్రిక సౌఖ్యవిషయమును నన్ను బాధించుచున్నవి. యిప్పుడు తగుమనిషి తన్నావిషయమై ప్రశ్నించుచుండ తన నిశ్చితాభిప్రాయ మెరింగించుట మాధవరావు విధియైయుండెను. అందుచే నాతఁడేమని చెప్పుటకునుఁ దోచక యాలోచింప సాగెను.

శ్రీని:-మీరీ విషయమున సిదివరకే ఆలోచించినారని తలచితిని నింతగా నాలోచింపవలసిన పనిలేదు. ఏమందురా! సుదర్శనమూర్తి

వాడు. వీని కన్నిటికిందోడు సాలుకు నాలుగైదు వేలాదాయమువచ్చు భూవసతియున్నది. అతని కెవ్వరునులేరు. అందుచే సరోజని నాతని కొసంగి వివాహ మొనర్పు టన్నివిధముల మాయభిమతము." అనెను.

మాధవరావు మాటాడలేదు.

మేమింతగ జెప్పుటకు వేరొక ప్రబల కారణమున్నది. అదేమన దాంపత్యసౌఖ్యమునకు మూలమనురాగము సరోజనీ మోహనరావు లొండొరులం బ్రేమించుకొని యుండిరి. వారిప్రేమ నిశ్చలమైనది. పవిత్రమైనది. అట్టిప్రేమ కంతరాయము కల్గించుటయనిన నిరువురకును మనో వ్యాకులత గల్గించుట యనుటలో సందేహములేదు."

మాధవరా వందులకుగూడ సమాధాన మొసంగలేదు.

"మీయంగీకారము లేనిదే మేమేమియు నొనర్చుట కవకాశము లేదు. సరోజనియు నేనును చదివినాము. సరోజని పవిత్రహృదయము ఆమెనాకు సోదరివంటిది. ఆమె సౌఖ్యమునకై పాటుపడుటలో నాకు కూడ కొంత బాధ్యతగలదు. మీరు 'ఊ' యనిన తక్కుంగల కార్యము లన్నియు నే వహించి వివాహమును జయప్రదముగ నెరవేర్చెదను."

"శ్రీనివాసరావూ! నేను కృతనిశ్చయుండనైతిని నీవుచెప్పిన దంతయు యదార్థము. నేను సరోజని వివాహము వద్దని కొడుకుతో వాదించినప్పుడు సరోజపొందిన దుఃఖము కళ్ళార చూచితినిగాన వివాహోచిత సన్నాహములన్నియు గావింపుము. సుదర్శనం! తమ్ము

కే యీవార్త తెలియఁజేసి పెండ్లికిరమ్మను. తదితరు లెవ్వరికిని తెలుపవద్దు. ” అనిపలికి మాధవరావు లేచెను. మాధవరావు లేచినంతనే మిగిలిన ముప్పురునుగూడ లేచిరి. అందరును సంతోషముతో యెవరి యిండ్లకు వారగిరి.

వివాహము జయప్రధముగ నెరవేరెను. ప్రభుత్వోద్యోగులందఱు వివాహమునకువచ్చి సరోజనీ మోహనరావుల నాశీర్వదించి కానుక లొసంగిరి. పెళ్ళి నాలుగవనాఁడు శ్రీనివాస మోహనరావులు సుకృతమూర్తియు శ్రీనివాసుని గృహముపందలి సావడిలో కూర్చుండి యుండ, యినస్పెక్టరుగారొక కవరుతో ప్రవేశించి శ్రీనివాసుని యాహ్వానముపై నొకకుర్చీపై నాశీనుఁడై “ మోహనరావుగారూ! శుభవార్త ” అనిపలుకుచు కవరు నాతని కొసంగెను. మోహనరావు కవరునుచించి చూడ నందు ప్రభుత్వమువారు మోహనరావుకు ‘సర్’ అను బిరుదు నొసంగినట్లు వ్రాయబడియున్నది. మోహనరావు వికసిత వదనముతో నాకవరును శ్రీనివాసరావున కొసంగెను. శ్రీనివాసరావదాని నెల్లరకుఁ జదివి వినిపించెను. అందఱానందించిరి.

వివాహ మైనపిమ్మటఁ గొన్నిదినములకు మోహనరావు కాకినాడలోని స్వగృహ మద్దెకొసంగి తానుగూడ విశాఖపట్టణములోనే కాపురముపెట్టెను. ఆనూతన దంపతు లన్యోన్యానురాగమున ప్రేమ ప్రవాహవీచికల నోలలాడుచు సుఖించిరి.

---

సంపూర్ణము.

